**Results of Chandamama—Camlin Colouring Contest No. 18 (Telugu)**

*1st Prize:* V. Suresh, Visakhapatnam. *2nd Prize:* Mas A. R. B. Sharma, Hyderabad. *3rd Prize:* D. Sureshkumar, Sriharikota. *Consolation Prizes:* C. Devi, Madras-28; F. Yodagiri, Wazat; S. Subbara, Vijayawada; M. D. Zareena Begum, Kalyani Khani P.O.; S. Tharkeswar Pattnaik, Balasore.

# లాలించండి



# మీరూ మురిసిపోండి

"నా బొమ్మలన్నిటికీనూ రావల్‌గామ్ ఎక్లైర్స్
అంటే మహా మనసు. అది బుద్ధిగా వుంటే
రెండు రెండిస్తాగా.
మిగతావన్నీ నాకేగా? మజాగా.
నాకైతే కోకో, కోకోనట్,
రెండూ యిష్టమే."







**Ravalgaon *Eclairs***

ది రావల్‌గామ్ షుగర్ ఫార్మ్ లి. వాల్‌చంద్ గ్రూప్ పరిశ్రమ
హెడ్ ఆఫీసు: కన్‌స్ట్రక్షన్ హవుస్, వాల్‌చంద్ హీరాచంద్ మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038.

Creative Unit-4647 Tel.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["మారిననిర్ణయం"] కు ఆధారం, మాచిరాజు కామేశ్వరరావు రచన.

పరిస్థితుల కారణంగా ఏవైనా అద్భుత శక్తులు లభించినా, ఆశపోతులూ, వివేకహీనులూ వాటివల్ల లాభపడకపోగా, ఎలా కష్టాలపాలవుతారో, "ఆశపోతు దివ్యదృష్టి" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

జాతమాత్రం నయః శత్రుం, వ్యాధిం చ శమనం నయేత్,
అతి పుష్టాంగ యుక్తోపి, స పశ్చాత్తేన మాన్యతే.

[తాను బలవంతుడైనా, ఆరోగ్యవంతుడైనా సరే, ప్రమాద కరుడైన శత్రువును గాని, వ్యాధిని గాని వెంటనే నశింపజేయాలి. అజాగ్రత్త వల్ల అపాయం తప్పదు.]

సంపుటి 68 ఏప్రిల్ '81 సంచిక 4

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




CHITRA




# విచిత్రపురి

మందగిరిలో వెంకటయ్య అనే యువకుడు ఉండేవాడు. అతని చిన్నతనంలో వాళ్ళ నాయనమ్మ, మందగిరికి పడమటి దిక్కుగా విచిత్రపురి అనే ఊరు ఉన్నదనీ, ఆ ఊరిలో ఉండే వారందరికీ అతీత శక్తులు ఉంటాయనీ చెబుతూండేది. విచిత్రపురి గురించి నాయనమ్మ చెప్పిన మాటలు వెంకటయ్య మనస్సులో బాగా నాటుకున్నాయి.

వెంకటయ్య పెద్దవాడయాడు. అతని నాయనమ్మ ఏనాడో పోయింది. ఆవిడ చెప్పిన విచిత్రపురి గురించి వివరాలు తెలుసుకోవాలని వెంకటయ్య ఎన్ని ప్రయత్నాలు చేసినా ఏమీ ఫలితం లేక పోయింది. అలాటి ఊరు ఉన్నట్టు ఒక్కరికీ తెలియదు. అటువంటి ఊరు ఉండటం అసంభవమని కూడా అనేక మంది అన్నారు.

అయినా వెంకటయ్యకు విచిత్రపురి ఎక్కడో వుండి వుంటుందన్న నమ్మకం పూర్తిగాపోలేదు.

ఒక రోజు వెంకటయ్య ఏదో పని మీద దూరగ్రామానికి వెళ్ళి, తిరిగి వస్తూ బ్రహ్మాండమైన గాలివానలో చిక్కుకుని, దారి తప్పాడు. పోగా,పోగా ఏదో ఊరు వచ్చింది.

వెంకటయ్య దారి వెంట పోతున్న ఒక మనిషిని ఆపి, ''బాబూ, ఇది ఏ ఊరు ?'' అని అడిగాడు.

''విచిత్రపురి,'' అన్నాడు ఆ మనిషి.

వెంకటయ్యకు చాలా సంతోషం కలిగింది. అలాటి ఊరు లేదని ఎంతమంది చెప్పినా, అతనికి నమ్మకం పోలేదు. ఆ నమ్మకం నిజమయింది. విచిత్రపురి అనేది ఉన్నది; తాను ఆ ఊళ్ళో ఉన్నాడు !

రాంబాబు

గొప్ప విజయం సాధించినంత ఆనం దంతో వెంకటయ్య వీధి వెంబడి నడుస్తుండగా ఒక దుకాణంలో అరటిపళ్ళు కనిపించాయి. వాటిని చూడగానే అతనికి అమితమైన ఆకలి వేసింది. అతను దుకాణం దగ్గిరికి వెళ్ళి, ఒక రూపాయకు అరటిపళ్ళు అడిగి తీసుకుని తిని, డబ్బు లియ్యటం మరిచిపోయి, అక్కడి నుంచి బయలు దేరాడు.

కొంత దూరం వెళ్ళాక, తాను పళ్ళకు డబ్బు ఇయ్యటం మరచిన సంగతి గుర్తు వచ్చి, వెనక్కి తిరిగి వెళ్ళి, దుకాణం వాడికి క్షమాపణ చెప్పుకుని, డబ్బు తియ్యటానికి జేబులో చెయ్యి పెట్టుకున్నాడు.



కాని దుకాణం వాడు, వెంకటయ్య కేసి నవ్వుతూ చూసి, "మీరు తిన్న పళ్ళకు డబ్బు ముట్టింది లెండి, మీరు వెళ్ళవచ్చు!" అన్నాడు.

వెంకటయ్య ఆశ్చర్యంగా తన జేబులో ఉన్న డబ్బు లెక్కచూసుకుంటే, ఒక రూపాయి తక్కువ ఉన్నది. తనకు గుర్తు లేకుండానే తాను దుకాణం వాడికి రూపాయి ఇచ్చి ఉండాలి అనుకున్నాడు వెంకటయ్య.

అక్కడినుంచి కదిలి ముందుకు నడుస్తూండగా, వెంకటయ్యకు ఒక మనిషి, ఒక మనిషి కాలు మోసుకు పోతూ కనిపించాడు.

వెంకటయ్య ఆ మనిషిని, "ఆ కాలు ఏం చేస్తావు?" అని అడిగాడు.

ఆ కాలు తన తమ్ముడిది అనీ, దాని మీద వ్రణం లేచిందనీ, శస్త్రచికిత్స కోసం ఆ కాలును వైద్యుడి దగ్గిరికి తీసుకు పోతున్నాననీ అన్నాడు.

వెంకటయ్యకు ఒక్కసారిగా తన శరీర మంతా చలవలు కమ్మినట్టయింది. అతను ఆ మనిషి వెనకగా వెళ్ళి జరిగిన దంతా చూశాడు.

ఆ మనిషి ఆ కాలును వైద్యుడి వద్దకు తీసుకుపోయాడు. వైద్యుడు వ్రణానికి

శస్త్రచికిత్స చేసి, మందువేసి కట్టుకట్టాడు. ఆ మనిషి ఆ కాలును తీసుకుని తన ఇంటికి వెళ్ళి, మంచంలో వున్న తన తమ్ముడికి ఆ కాలు తగిలించాడు. వెంటనే ఆ తమ్ముడు లేచి, గదిలో కాసేపు అటూ ఇటూ నడిచి, తృప్తి పడ్డట్టు కనిపించాడు.

వెంకటయ్య అంతులేని ఆశ్చర్యంతో ఆ వ్యక్తికి తన సంగతి చెప్పుకున్నాడు. వెంకటయ్య ఊరికి కొత్త అని తెలిసి, ఆ అన్నదమ్ములు అతన్ని ఆ రాత్రికి తమ ఇంట అతిథిగా ఉండమన్నారు.

ఆ రాత్రి వెంకటయ్యకు చక్కని సదుపాయాలు జరిగాయి. భోజనం చేసి పడుకునే ముందు అతను తనకు ఆతిథ్యం ఇచ్చిన వారితో మాట్లాడుతూ కూర్చున్నాడు. ఆ సమయంలో అన్న కంటిలో ఏదో పడింది.

అది గమనించి వెంకటయ్య, "నేను కంటిలో ఊదుతాను, ఉండండి," అన్నాడు.

"ఎందుకండీ?" అంటూ అన్న తన కనుగుడ్డు పైకి తీసి, దాన్ని అటూ ఇటూ తిప్పి నలకను చూసి, దాన్ని తుడిచేసి, కనుగుడ్డు మళ్ళీ యథాస్థానంలో పెట్టుకుని, ఏమీ జరగనట్టు సంభాషణ కొనసాగించాడు.

మర్నాడు తెల్లవారుతూనే వెంకటయ్యకు ఆ ఊరు వదిలిపోవాలనిపించింది. అక్కడి వాళ్ళను చూస్తే అతనికేదో దడగా ఉన్నది. కాని అన్నదమ్ములు మరి కొన్నాళ్ళు ఉండమని బలవంతం చేశారు.

"లేదులెండి! వెళ్ళాలి! తొందరపనులున్నాయి!" అంటూ వెంకటయ్య వాళ్ళను దారి అడుగుదామనుకుంటుండగా, వాళ్ళు కోపంగా, "సరే అయితే, వెళ్ళు!" అన్నారు.

మరుక్షణం వెంకటయ్య తన ఇంటి ముందున్నాడు. అతను ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా తన అనుభవం నిజమో, భ్రమో తెలియలేదు.





# ఉద్యోగార్హత

మహారాజపురం జమీందారు చిదంబరం వద్దకు ఇద్దరు యువకులు వచ్చారు. ఇద్దరూ చదువుకున్నవాళ్ళే. ఒకడి పేరు భరద్వాజ ఇంకొకడి పేరు గోపాలం. వాళ్ళకు ఉద్యోగాలేవైనా ఉంటే ఇయ్యమని శిఫార్సు చేస్తూ, వాళ్ళను జమీందారు మిత్రుడు ఒకాయన పంపాడు.

చిదంబరం వాళ్ళతో, "ప్రస్తుతం దివాణంలో ఖాళీలులేవు. నా మిత్రుడు పంపాడు గనక మీకు చెరొక గ్రామంలోనూ రెండేసి ఎకరాల మెట్టభూమి ఇస్తాను. దాన్ని సాగుచేసుకునేటందుకు గాను కొంత డబ్బు అప్పుగా ఇస్తాను. ఏడాది అయాక ఆ బాకీ తీర్చి, ఆ భూమి మీద జీవించండి!" అని, చుక్కపల్లి, నందిపల్లి అనే గ్రామాలకు పంపాడు.

భరద్వాజ జమీందారు ఇచ్చిన ఉత్తరాన్ని తీసుకుపోయి చుక్కపల్లి గ్రామాధికారికి ఇచ్చి, రెండు ఎకరాల మెరక భూమి పుచ్చుకున్నాడు. అది బీడుభూమి. అందులో చింతచెట్లూ, తుమ్మచెట్లూ లాటివి కొద్దిగా ఉన్నాయి.

జమీందారు అప్పుగా ఇచ్చిన డబ్బుతో ఆ భూమిని సాగులోకి తీసుకు వచ్చి, ఏడాది తిరిగేసరికి జమీందారు బాకీ తీర్చడం భరద్వాజకు సాధ్యంగా కనబడలేదు. అయినా అతనికి ఒక ఆలోచన తట్టింది.

గ్రామస్థులు చెప్పేదాన్ని బట్టి ఆ భూమిలో మట్టి ఇటుకలు తయారు చెయ్యటానికి పనికి వొస్తుందని తెలిసింది. అందుచేత భరద్వాజ ఇటుకలు తయారు చేసే వాళ్ళను మాట్లాడి, వాళ్ళచేత ఇటుకలు తయారు చేయించి, చింతచెట్లూ, తుమ్మచెట్లూ నరికించి పొలంలోనే ఆవం ఏర్పాటు చేసి ఇటుకలు కాల్పించాడు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

వాటికి బస్తీలలో మంచి ధర వచ్చింది. తరవాత పెద్ద ఎత్తున ఇటుకల వ్యాపారం సాగించాడు. ఏడాది తిరిగేసరికల్లా భరద్వాజ జమీందారు దగ్గిరికి తిరిగి వచ్చి, జమీందారు తనకు అప్పుగా ఇచ్చిన సొమ్ము తిరిగి ఇచ్చేశాడు.

జమీందారు అతన్ని, "డబ్బు ఎలా సంపాదించావు? నీకు బతుకు తెరువు ఎలా అమరింది?" అని అడిగాడు.

భరద్వాజ తాను అనేక గ్రామాలకు ప్రధాన ఇటుకల వ్యాపారి అయినట్టు చెప్పాడు. ఆ వ్యాపారంలో తాను ఎంతైనా పైకి రాగలనని అతను చెప్పిన మీదట జమీందారు, "బాగుంది! నా బాకీ నువు తీర్చనవసరం లేదు. దాన్ని పెట్టుబడిగా పెట్టుకుని నీ వ్యాపారం ఇంకా అభివృద్ధి చేసుకో," అని చెప్పి పంపేశాడు.

భరద్వాజ లాగే గోపాలం కూడా నంది పల్లిలో రెండు ఎకరాల మెరకభూమి గ్రామాధికారి నుంచి పుచ్చుకున్నాడు. అది కూడా పట్టి బీడుభూమి. జమీందారు ఇచ్చిన డబ్బుతో వీలుబడిన మేరకు అతను మనుషులను పెట్టి భూమిదున్నించి మిరపనారు నాటించాడు. కాని తరుణంలో వర్షం పడక మొక్కలన్నీ ఎండిపోయాయి. జమీందారు అప్పుగా ఇచ్చినది పూర్తిగా వ్యర్థమయింది.

గోపాలం జమీందారు వద్దకు వచ్చి, డబ్బు అంతా దండుగ అయిపోయిందనీ తాను సంపాదించగలిగినప్పుడు బాకీ తీర్చుతాననీ, తనకు భూమి అవసరం లేదనీ, మరేదన్నా బతుకు తెరువు చూపమనీ అన్నాడు.

జమీందారు గోపాలానికి తన దివాణంలో ఉద్యోగం ఇప్పించి, తన మిత్రుడికి ఇలా రాశాడు: "నువు పంపిన యువకులు ఇద్దరూ చదువుకున్న వాళ్ళే అయినా, వారిలో భరద్వాజ అనే కుర్రవాడు తన బ్రతుకుతెరువు తాను సృష్టించుకోగల సమర్థుడు. పోతే, గోపాలం అనే కుర్రవాడు ఉద్యోగం చెయ్యటానికి తప్ప పనికిరాడు. అతనికి దివాణంలో ఉద్యోగం ఇచ్చాను."






## 12

[కుంభాండుడూ, ఆటవికులూ తమ కోసం వెతుకుతున్నారని గ్రహించిన నమరసేనుడు, సైనికులతో ఒక గుహలో దాక్కున్నాడు. సైనికులు దాపులనున్న చెట్లమీద కాపలా వున్నారు. గుహ వెనుక ఏవో ధ్వనులు వినబడటంతో నమరసేనుడు అటు వెళ్ళి, ఒక రహస్యద్వారం తెరిచాడు. ఆ వెంటనే యిద్దరు బలిష్ఠులు అతణ్ణి పట్టుకున్నారు. —తరవాత]

హఠాత్తుగా యిద్దరు బలిష్ఠులు తన మీదికి దూకి పట్టుకోవడంతో, సమర సేనుడు ఆత్మరక్షణకు ఏమీ చేయలేక పోయాడు. అతడి నోటమాట రాలేదు. ఇంతలో గుహ ముందు నుంచి, భయంకరమైన సింహ గర్జన వినబడింది. ఆ వెంటనే సమరసేనుణ్ణి బంధించిన యిద్దరూ, అతణ్ణి భుజాల మీద వేసుకుని, అక్కడినుంచి పరిగెత్తసాగారు.

సమరసేనుడు చేయగలిగిందేమీ లేక, ఆ పరిసర ప్రాంతాలను పరీక్షగా చూడ సాగాడు. అదంతా ఒక కొండ లోయ. అతణ్ణి బంధించిన యిద్దరూ, కొండ మిట్ట మీది నుంచి పల్లానికి దిగుతున్నారు. దూరంగా ఎక్కడో మినుకు, మినుకు మంటూ దీపాలు కనబడుతున్నాయి.

"మీరెవరు? నన్నెందుకు బంధించారు?" అని అడిగాడు సమరసేనుడు.



వాత సమరసేనుడి చేతులు పడిసిపట్టుకుని లాగుతూ, ముందుకు నడవసాగారు.

అలా కొంతదూరం వెళ్లేసరికి, దీపాల కాంతి దగ్గిర పడింది. దారిలో చెట్టు మీద కావలి కూర్చున్న వాడొకడు, "మన వాళ్లు ఎవర్నో బంధించి తెస్తున్నారు, దారి యివ్వండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు. ఆ కేకకు జవాబుగా మరికొన్ని కేకలు వినబడినై. సమరసేనుడికి ఆశ్చర్యంతోపాటు, భయంకూడా కలిగింది.

కొద్దిసేపటి తరవాత ఆ ఇద్దరూ సమర సేనుణ్ణి ఒక యింటికి తీసుకుపోయారు. వాళ్ళు తలుపు తట్టగానే, ఒకడు వచ్చి తలుపు తెరిచాడు. వాళ్ళు సమరసేనుణ్ణి లోపలికి తీసుకుపోయి, తిరిగి కాళ్ళూ, చేతులూ తాళ్ళతో బంధించి, "ఈ రాత్రికి యిదే నీ పడక గది. తెల్లవారిన తరవాత నీ పాలిటి ముసళ్ళ పండగ వస్తుంది," అంటూ తలుపు మూసి వెళ్ళిపోయారు.

దారీ తెన్నూ లేని ఆలోచనలతో, సమర సేనుడు ఆ రాత్రంతా ఆ చీకటి గదిలో గడిపాడు. తెల్లవార వచ్చిన సూచనగా కోళ్ళ కూతలు వినబడసాగినై. కొద్దిసేపటి తర్వాత గుడిగంటలు మోగుతున్న శబ్దం కూడా వినబడింది. ఆ వెంటనే అడుగుల చప్పుడూ, కొద్దిసేపట్లో కిర్రుమంటూ గది తలుపు తెరుచుకోవడం జరిగింది.

ఆ ప్రశ్నకు అతణ్ణి బంధించి తీసుకు పోతున్న వాళ్ళిద్దరూ ముఖముఖాలు చూసుకుని, మౌనంగా వూరుకున్నారు. సమరసేనుడు కొంచెం ఆగి వాళ్ళను అదే ప్రశ్న మరొకసారి అడిగాడు.

అప్పుడు ఆ యిద్దరిలో ఒకడు, "అదంతా మా నాయకుణ్ణి అడిగితే చెబుతాడు," అన్నాడు.

ఆ జవాబుతో యిక వాళ్ళను ప్రశ్నించి ప్రయోజనం లేదనుకున్నాడు, సమర సేనుడు. కొండమిట్ట ప్రదేశాన్నుంచి లోయలోకి దిగగానే, ఆ యిద్దరూ సమర సేనుణ్ణి కిందికి దింపి, చేతులకూ, కాళ్ళకూ కట్టిన కట్లు విప్పేశారు. తర

సమరసేనుడు తల తిప్పి చూశాడు. ఇద్దరు కొత్తవాళ్ళు కత్తులు ధరించి, కోర చూపులు చూస్తూ సమరసేనుడి దగ్గిరకు వచ్చారు. వాళ్లు ఏవో సైగలు చేసుకోవడం గమనించి, సమరసేనుడు, "ఆ మోగినవి గుడి గంటలేనా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వాళ్ళల్లో ఒకడు నవ్వుతూ, "అవి గుడిగంటలు కావు; నీ పాలిటి చావు బాజాలు! వ్యాఘ్రదత్తుడు అడిగిన దానికి సరి అయిన జవాబివ్వకపోయావో, యీ రోజుతో నీకు నూరేళ్లబతుకూ నిండి నట్టే, జాగ్రత్త!" అన్నాడు.

ఈ వ్యాఘ్రదత్తుడెవరు? తన నుంచి అతడు తెలుసుకోగోరుతున్న రహస్యం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలకు సమర సేనుడికి ఎంత ఆలోచించినా జవాబు దొరకలేదు. కోరచూపులు చూస్తూ, క్రూరాతిక్రూరంగా వున్న వ్యాఘ్రదత్తుడి అనుచరులను అడిగి లాభం లేదని సమర సేనుడు వూరుకున్నాడు.

ఆ వచ్చిన వాళ్ళు మౌనంగా సమర సేనుడి కట్లు విప్పి అతణ్ణి గదినుంచి బయటికి తీసుకు వచ్చారు.

సమరసేనుడు వాళ్ళను, "నన్నెక్కడికి తీసుకుపోతున్నారు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వాళ్ళు కోపంగా చూస్తూ, "నిన్ను, మా నాయకుడైన వ్యాఘ్రదత్తుడి దగ్గిరకు తీసుకుపోతున్నాం. అక్కడ ఒళ్ళు దగ్గిర పెట్టుకుని ప్రవర్తించు. తెలిసిందా?" అని గద్దించారు.





కొంతదూరం నడిచి అందరూ ఒక పెద్ద భవనంలో ప్రవేశించారు. అక్కడ రకరకాల ఆయుధాలు ధరించిన చాలా మంది సైనికులు గొడవగా మాట్లాడుతూ కనిపించారు.

హఠాత్తుగా భవనంలోని ఒక పెద్దతలుపు తెరవబడింది. ఎదురుగా ఒక ఎత్తయిన పీఠం మీద ఠీవిగా ఒకడు కూర్చుని వున్నాడు. ఇతడే వ్యాఘ్రదత్తుడై ఉంటాడని, సమరసేనుడు ఊహించాడు.

"సమరసేనా, నేనే వ్యాఘ్రదత్తుణ్ణి! నీకు వ్యాఘ్రమండలం తరఫున అభినందనలు తెలియజేస్తున్నాను. బహుశా, నీ పూర్వులూ, నా పూర్వులూ కూడా కుండలినీ ద్వీపంలో ఒకే పట్టణవాసులై వుండవచ్చు. ఇక్కడ—ఈ మంత్రాల దీవిలో, వారి సంతానమైన మనం, యిలా హఠాత్తుగా కలుసుకోవడం, నీకు ఆశ్చర్యం కలిగించడం లేదా?" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

సమరసేనుడికి తను బంధింపబడిన దగ్గిరనుంచి జరుగుతున్న ప్రతి సంఘటనా ఆశ్చర్యం కలిగిస్తున్నది. తనను ఎవరు, ఎందుకు బంధించారనేది, ఒక ఆశ్చర్యకరమైన సంగతి. కుండలినీద్వీపం పేరు కూడా చెప్పి, తమ పూర్వీకుల నివాసస్థానాల మాట గుర్తు చేస్తున్న, ఈ వ్యాఘ్రదత్తుడి ధోరణి కూడా ఆశ్చర్యకరంగానే వున్నది.

"వ్యాఘ్రదత్తా, నాకు ప్రతిదీ అయోమయంగా, ఆశ్చర్యకరంగా కనబడుతున్నది. నన్ను, నీ అనుచరులు ఎందుకు బంధించి యిక్కడికి తీసుకువచ్చినట్టు? అసలు మీరీ భయంకర ద్వీపానికి ఎప్పుడు వచ్చారు?" అని అడిగాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు ఒకటి, రెండు క్షణాల కాలం సమరసేనుడి ముఖం కేసి పరీక్షగా చూసి, కనుబొమలు చిట్లించి, "సమరసేనా, నీవేదో అమాయకత్వం నటిస్తున్నావన్న అనుమానం, నాక్కలుగుతున్నది.

సరే, నేచెప్పవలసినదేదో చెపుతాను, విను. శమనద్వీప రాజైన శాక్తేయుడి సంగతి నీకు తెలియంది కాదుగదా? అతడు దేశాలమీద దండెత్తిపోయి, అనేక దేశాలతో పాటు, మన కుండలినీ ద్వీపాన్ని కూడా దోచుకున్నాడు. మన పూర్వుల్లో దృఢకాయులైన కొందరిని బానిసలుగా పట్టుకుని, మరికొన్ని ద్వీపాలను దోచుకునేందుకు ఓడల్లో బయలుదేరాడు. ఆ ప్రయత్నంలో యీ ద్వీపానికి వచ్చిన శాక్తేయుడు, యిక్కడ మృత్యువు వాత పడ్డాడని నీకు తెలుసనుకుంటాను. అతడి మరణం తరవాత బానిసలుగా బంధింపబడిన మన పూర్వులు స్వేచ్ఛపొంది ఈ ద్వీపంలోనే నివాసాలు ఏర్పరచుకున్నారు. మనవాళ్ళు స్వేచ్ఛ పొందటానికి, శాక్తేయుడి శిష్యులైన యిద్దరు మాంత్రికుల మధ్య చెలరేగిన ద్వేషం కొంత సహాయం చేసింది. ఆ శిష్యులిద్దరినీ నీవు ఎరుగుదువు గదా?'' అన్నాడు.

''అవును, ఎరుగుదును,'' అన్నాడు సమరసేనుడు.

''ఐతే, యిప్పుడు చెప్పు, ఆ శాక్తేయుడి త్రిశూలం ఎక్కడ వున్నది? చండీదేవి ప్రసాదితమైన ఆ త్రిశూలం శక్తి నీవు వినే వుంటావు!'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.




ఈ త్రిశూలం సంగతి వింటూనే సమరసేనుడు నివ్వెరపోయాడు. వ్యాఘ్రదత్తుడు శమనద్వీపరాజైన శాక్తేయుణ్ణి గురించి చెప్పిన సంగతులేవీ సమరసేనుడికి తెలియవు. చతుర్నేత్రుడు ఒకసారి తమ గురువైన శాక్తేయుణ్ణి గురించి కొంత చెప్పాడు. శాక్తేయుడు కుండలినీ ద్వీపాన్ని దోచిన సంగతి సమరసేనుడు వినలేదు. చండీదేవి, శాక్తేయుడికి ప్రసాదించిన త్రిశూలం గురించి, అతడికే మాత్రం తెలియదు.

''వ్యాఘ్రదత్తా, మీరడిగిన ప్రశ్నలలో దేనికీ నేను జవాబివ్వలేను. మీరు, నన్ను పొరబాటు పడి బంధించి వుంటారు.

శాక్తేయుణ్ణి గురించి గానీ, అతడి దివ్య శక్తి బలంగల త్రిశూలం సంగతి గానీ, నాకు తెలియదు,'' అన్నాడు సమర సేనుడు.

వ్యాఘ్రదత్తుడు, సమరసేనుడి జవాబుకు మండిపడుతూ, ''నువ్వు అమాయకుడిలా నటించి, నన్ను మోసపుచ్చలేవు. రేపు ఉదయం పది గంటల వరకూ అవకాశం యిస్తున్నాను. ఈ లోపల నీ క్షేమం గుర్తుంచుకుని, నిజం చెప్పటం మంచిది. అలా చెప్పకపోయావో నిన్ను చిత్రహింసలకు గురిచేసి, భద్రచాముండికి ఆహారంగా వేస్తాను. ఇక్కడ నిన్ను రక్షించే వాళ్ళెవరూ లేరు. ఆ సంగతి మరవకు,'' అన్నాడు భీకరంగా.

సమరసేనుడు నిశ్చేష్టుడై పోయాడు. తనకే మాత్రం తెలియని సంగతులు చెప్పమని బలవంత పెడుతున్నాననేది, వ్యాఘ్రదత్తుడికి తెలియదని సమర సేనుడు గ్రహించాడు.

వ్యాఘ్రదత్తుడి ఆజ్ఞ కాగానే యిద్దరు భటులు సమరసేనుణ్ణి, అక్కడి నుంచి ఒక చీకటిగదికి తీసుకుపోయారు. తరవాత అతడి కాళ్ళూ, చేతులూ తాళ్ళతో కట్టివేశారు. ఆ గదిలో ఒక పక్కగా భయంకర రూపిణి అయిన భద్రచాముండి విగ్రహం వున్నది.




భటులు ఆ విగ్రహాన్ని సమరసేనుడికి చూపుతూ, ''రేపు పది గంటలలోగా, మా నాయకుడికి నిజం చెప్పకపోతే, నీవు యీ దేవికి బలికాక తప్పదు.'' అని హెచ్చరించి వెళ్ళిపోయారు.

సమరసేనుడు ఆకలితోబాటు, కాళ్లూ, చేతులూ కట్టబడడంవల్ల కలిగిన బాధలతో నానాయాతనా పడసాగాడు. తెల్లవారిన తరవాత తనకు మరణంతప్పదన్న భయం కలిగింది. ఇటువంటి ఆపత్సమయంలో చతుర్నేత్రుడు లాంటి మాంత్రికుడు తప్ప, తనకు సహాయపడగల వాళ్ళు మరెవరూ లేరు. కాని, చతుర్నేత్రుడికి తాను ప్రాణాపదలో వున్నట్టు తెలియడం ఎలా?

సమరసేనుడు యిలాంటి ఆలోచనలతో, రాత్రి చాలా గడిచేవరకూ కదలా మెదలక వుండిపోయాడు. అతడికి కొంచెం కునుకుపడుతున్న సమయంలో ఎవరో గది తలుపు తెరిచిన శబ్దం అయింది. సమరసేనుడు తల తిప్పి చూశాడు. కత్తులు ధరించిన యిద్దరు మనుషులు లోపలికి వచ్చారు. వాళ్లు, బహుశా తనను చిత్రహింసలకు గురిచేసేందుకు వచ్చిన వ్యాఘ్రదత్తుడి భటులై వుంటారని, సమరసేనుడు భావించాడు.

ఆ వచ్చిన వాళ్ళిద్దరూ మౌనంగా సమరసేనుడి కాళ్ళ, చేతుల కట్లు విప్పారు. ఆశ్చర్యంగా చూస్తున్న సమరసేనుణ్ణి, తమ వెంట రావలసిందిగా సైగచేసి, గదిలోంచి బయటికి నడిచారు.

సమరసేనుడు మారుమాట్లాడకుండా వాళ్ళ వెనక నడవసాగాడు. కొంతదూరం వెళ్ళిన తరవాత, వాళ్లకు ఆయుధాలు ధరించిన యిద్దరు వ్యాఘ్రదత్తుడి భటులు, అదే మార్గాన ఎదురుగా వస్తూండడం కంటబడింది. వెంటనే సమరసేనుడి వెంట వున్నవాళ్ళు, అతణ్ణి ఒక యింటి పక్కన వున్న చీకటి ప్రదేశంలోకి తీసుకుపోయారు.

"భయపడకు, మేము నీ మిత్రులం! ఆ వచ్చేవాళ్లు గస్తీ తిరుగుతున్న వ్యాఘ్రదత్తుడి సేవకులు. మనం యీ చీకటిలో దాగి వుండి, వాళ్ళు దగ్గిరకు రాగానే హఠాత్తుగా మీద పడి, హతమార్చాలి," అన్నారు.

సమరసేనుడి మిత్రులం అని చెప్పిన వాళ్ళు, యిలా అంటూ వుండగానే, వ్యాఘ్రదత్తుడి గస్తీ భటులు అక్కడికి వచ్చారు. చీకటిలో పొంచివున్న ముగ్గురూ, మెరుపు వేగంతో వాళ్ల మీదికి దూకి, భటులు కేకలు పెట్టే లోపలే గొంతులు బిగించి పట్టుకుని లాక్కుపోయి, దాపులనున్న ఒక పాడు బావిలో పడవేశారు.

ఆ తరవాత ముగ్గురూ కొండదారుల వెంట నడిచి, సూర్యోదయం వేళకు, ఒక చిన్న పల్లె చేరారు. —(ఇంకా వుంది)






# మారిన నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, యిలా అర్ధరాత్రి, అపరాత్రి వేళల్లో శ్మశానాల వెంట ఎంతకాలమని తిరుగుతావు? ఒక్కొక్కసారి మనిషి తన నిర్ణయాలను మార్చుకోవడంవల్ల మేలు కలగవచ్చు. నాగరాజు లాంటి పట్టుదలగలయువకుడు, ఆఖరి క్షణంలో తన నిర్ణయం మార్చుకున్నాడు. నీకు అతని కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

నాగరాజు అనే యువకుడికి నగరంలో మంచి ఉద్యోగం వున్నది. అతనికి యింకా పెళ్ళి కాలేదు. అతని తల్లిదండ్రులకు నాగరాజు మేనమామ కూతురయిన

## బేతాళ కథలు




రత్నాన్ని కోడలుగా తెచ్చుకోవాలని కోరిక. ఆమెకు అంతగా చదువు లేదు. అంత అందగత్తెకూడా కాదు. ఆమెకు నాగరాజు అంటే అమితమైన ప్రేమ. అయితే, ఏ ప్రత్యేకతలు లేని రత్నాన్ని పెళ్ళి చేసుకోవడం నాగరాజుకు యిష్టంలేదు.

ఒకసారి నాగరాజు ఏదో పండగకు సొంత ఊరు వచ్చాడు. తల్లిదండ్రులు అతనితో, ''పనిలో పనిగా రత్నాన్ని పెళ్ళి చేసుకుని వెంటబెట్టుకుపో,'' అన్నారు.

నాగరాజు సూటిగా జవాబివ్వకుండా, అసలు విషయాన్ని దాటవేశాడు.

ఆ సాయంత్రం నాగరాజు ఊరికి దూరంగా వున్న మామిడితోపుల్లోకి షికారు వెళ్ళాడు. సూర్యాస్తమయ సమయంలో వర్షం ప్రారంభమైంది. అతను కొంత దూరం పరిగెత్తి, ఒక పెంకుటింటి అరుగు మీద తల దాచుకున్నాడు. అయితే, ఆ సరికే అతను బాగా తడిసిపోయాడు.

''అయ్యో, బాగా తడిసిపోయావు. లోపలికిరా, బాబూ!'' అంటూ కిటికీ లోంచి అతణ్ణి చూసిన ఒక ముసలావిడ తలుపు తెరిచింది.

నాగరాజు మొహమాటపడుతూనే లోపలికి వెళ్ళాడు. ''సంధ్యా, పొడిగుడ్డ తీసుకురామ్మా! ఈయన వర్షంలో బాగా తడిసిపోయాడు,'' అని ముసలావిడ లోపలికి కేక పెట్టింది.

''అందమైన పేరు!'' అనుకున్నాడు నాగరాజు.

ఇంతలో కాళ్ళ గజ్జెల గలగల శ్రావ్యంగా వినిపించి గుమ్మం దగ్గిరే ఆగిపోయింది. ముసలావిడ గుమ్మందాకా వెళ్ళి, బట్ట అందుకున్నది.

నాగరాజు తడిసిన తల తుడుచుకుంటూండగా, ''కాసిని వేడిపాలు పట్టుకురా, సంధ్యా!'' అని మళ్ళీ కేకపెట్టింది ముసలావిడ.

తరవాత ఆమె నాగరాజును గురించి తెలుసుకున్నది; తమను గురించి చెప్పింది: వాళ్ళు ఆ ఊరుకు కొత్తగా వచ్చారు.

కౌలుకు యిచ్చిన పొలం సొంతంగా చేసుకుంటున్నారు. ఆమెకు సంధ్య ఒక్కతే కూతురు. ముసలావిడ భర్త చాలా కాలం కిందటే పోయాడు.

సంధ్యను చూడాలని నాగరాజుకు చాలా కోరికగా వున్నది. కాని, పాలు కూడా గుమ్మం దాకా వెళ్ళి ముసలావిడే అందుకోవడంతో, అతడికి ఆ అవకాశం చిక్కలేదు.

మర్నాడు పని గట్టుకుని ఆ ఇంటి వైపుకు వెళ్ళాడు, నాగరాజు. ముసలావిడ కిటికీలకు కొత్తగా అల్లిన తెరలు కడుతున్నది. ఆమె నాగరాజును నవ్వుతూ ఆహ్వానించి, "మా సంధ్య తోచనప్పుడు యిలా తెరలూ అవీ అల్లుతూవుంటుంది," అన్నది

ఆ పూట అతనికి సంధ్య చేసిన రుచికరమైన ఫలహారం అందింది కాని, ఆమె దర్శనం మాత్రం కాలేదు.

ఆ మర్నాడు తమ దొడ్లో కాసిన రెండు దానిమ్మపళ్ళు తీసుకుని, నాగరాజు, సంధ్య వాళ్ళ ఇంటికి వెళ్లాడు. వీధి తలుపు మూసి వున్నది. లోపలి నుంచి శ్రావ్యమైనపాట వినిపిస్తున్నది. నాగరాజు తీయని ఆ పాట వినడంలో లీనమై పోయాడు. అప్పుడే గుడి నుంచి వచ్చిన ముసలావిడను, అతను గమనించలేదు.



ముసలావిడ దగ్గిరగా చేరవేసి వున్న తలుపు తోస్తూ, "ఇప్పుడే వచ్చావా, బాబూ? మా సంధ్య పాట మొదలు పెడితే, పరిసరాలు మరిచిపోతుంది," అన్నది.

లోపలి గదిలో వున్న సంధ్య, నాగరాజు కళ్ళబడలేదు. అతడు దానిమ్మపళ్ళను ముసలావిడ చేతిలోపెట్టి, కాసేపు కబుర్లు చెప్పి, ఇంటికి వచ్చేశాడు. అతడికి సంధ్య అన్నివిధాలా తగిన భార్య అనిపించింది. ఆమె పెద్దగా అందంగా లేకపోయినా, ఆమెనే పెళ్ళాడాలన్న దృఢనిశ్చయానికి వచ్చాడు, నాగరాజు. మర్నాడు ఎలాగయినాసరే సంధ్యను చూడాలనీ,



ముసలావిడకు తన అభిప్రాయం చెప్పాలనీ నిశ్చయించుకున్నాడు.

నాగరాజు ఆ మరుసటి రోజున సంధ్య వాళ్ళ ఇంటిని సమీపిస్తుండగా, హఠాత్తుగా పక్క సందులోంచి వచ్చిన ఎద్దొకటి, అతణ్ణి పొడిచి పారిపోయింది.

నాగరాజు కిందపడిపోయాడు. అతడి చేతికి గాయమై, రక్తం కారసాగింది. ఈ అలికిడికి ముసలావిడ ఇంట్లోంచి బయిటికి వచ్చింది. ఆమె నాగరాజును చూసి, "అయ్యో, ఏం జరిగింది ? చేతి నుంచి రక్తం కారుతున్నది, లోపలికిరా," అని ఆందోళనపడుతూ వచ్చి, గాయపడిన నాగరాజు చేయి పట్టుకున్నది.

"మీతో ఒక ముఖ్య విషయం చెప్పాలని వస్తున్నాను. ఆ ఆలోచనలో పక్క సందు నుంచి పరిగెత్తుకొస్తున్న ఎద్దును చూడ లేదు," అన్నాడు నాగరాజు.

ముసలావిడ నాగరాజును ఇంట్లోకి తీసుకుపోయి కూర్చోబెట్టి, "సంధ్యా, చెంబుతో నీళ్ళు పట్టుకురా," అని గట్టిగా కేక పెట్టింది.

నడవాగది కిటికీవద్ద నిలబడి సంధ్య యిదంతా చూస్తూనే వున్నది. ఆమె ముఖ కవళికల్లో జాలి, ఆదుర్దా లాంటి లక్షణాలే లేవు. తీరా, తల్లి కేక వేశాక, ఆమె కిటికీ దగ్గిర నుంచి కదిలి, కొంచెం సేపట్లో నీళ్ళచెంబు తీసుకుని నాగరాజు వున్న చోటుకు వచ్చింది.

ఆమె అందం చూసి నాగరాజు కళ్ళు చెదిరిపోయాయి. అతను అంతటి సౌందర్యవతిని నగరంలో కూడా చూసి వుండలేదు. ముసలావిడ సంధ్య తెచ్చిన నీళ్ళతో, నాగరాజు గాయం కడిగింది. ఆ తరవాత పసుపూ, శుభ్రమైన గుడ్డా తెమ్మని చెప్పింది.

సంధ్య పసుపూ, గుడ్డా తెచ్చి తల్లికి యిచ్చి, లోపలికి వెళ్ళిపోయింది. ముసలావిడ నాగరాజు గాయానికి కట్టుకట్టింది. అతడు కాస్త తేరుకున్నాక, "ఇప్పుడు చెప్పు, బాబూ ! నువు చెప్పాలనుకుంటున్న

ముఖ్య విషయం ఏమిటి?'' అని అడిగింది.

వెంటనే నాగరాజు, ''మా మేనమామ కూతురితో, నా పెళ్ళి జరగబోతున్నది. మీరూ, సంధ్యా తప్పకుండా రావాలి,'' అని చెప్పి ఇంటికి వచ్చేశాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''రాజా, నా కొక సందేహం! నాగరాజు సంధ్యను చూడకముందే ప్రేమించాడు కదా. ఆమె అతిసాధారణంగా వున్నా కూడా, ఆమెనే పెళ్ళాడాలని నిర్ణయించుకున్నాడు. అయినా, ఆఖరిక్షణంలో తన నిర్ణయాన్ని ఎందుకు మార్చుకున్నాడు? అంత గొప్ప సౌందర్యవతికి తాను తగననుకున్నాడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''నాగరాజు తన నిర్ణయాన్ని మార్చుకోవడం సరి అయినదే. ప్రతి మనిషికీ కనీసమైన కొన్ని మంచి గుణాలుండాలి. అవి లోపించినప్పుడు, యితర అర్హతలు ఎన్ని వున్నా ప్రయోజనం లేదు. పౌరుషం, ఆత్మాభిమానం, ధైర్యం వంటివి మగవాడి కుండవలసిన కనీస గుణాలు. అలాగే స్త్రీకి కరుణ, ఆదరణ, సేవాధర్మం వంటి గుణాలు తప్పకుండా వుండాలి. ఆ గుణాలు లేని స్త్రీ భార్యగా, తల్లిగా తన భాధ్యతలు సక్రమంగా నిర్వర్తించ లేదు. సంధ్య నాగరాజు గాయాన్నీ, స్రవిస్తున్న రక్తాన్నీ చూసి కూడా ఏ మాత్రం చలించలేదు. తోటి మనిషిగా సానుభూతి కనబరచలేదు. ఆమెది రాతిగుండె అని యీ విషయం రుజువు చేస్తున్నది. అందుకే అన్ని అర్హతలున్న అందాల రాశిని కాక, కనీసార్హతలయిన ప్రేమ, అభిమానం వున్న మేనమామ కూతురిని పెళ్ళాడటానికి నాగరాజు నిర్ణయించు కున్నాడు,' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# భయంలేనివాడు

రాజయ్యకి ఒక్కడే కొడుకు. వాడికి రాము అని పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగాడు. రాముకి గారాబం ఎక్కువ కావడంతో, బొత్తిగా భయం, భక్తీ కూడా లేకుండా పోయాయి. మరీ విచిత్రమైన విషయం ఏమిటంటే, వాడికి 'భయం' అంటే అసలు తెలీదు. చీకట్లో ఒంటరిగా ఎంత దూరమైనా వెళ్ళడానికీ, అర్ధరాత్రి జనసంచారం లేని చోటుకి వెళ్ళడానికీ కూడా వాడు భయపడే వాడు కాదు. రాజయ్యకి రాము ఒక పెద్ద సమస్య అయి పోయాడు. భయం లేకపోవడం అన్నది పెద్ద విశేషమే అయినా, దాని వల్ల ఎన్నో ప్రమాదాలు ఏర్పడవచ్చు. భయం లేకుండా ఏ పులి ముందుకో వెళ్ళి నిలబడితే, అది రామును అమాంతం కబళించవచ్చు! రాజయ్య రాముకి భయపడడం నేర్పాలనుకున్నాడు. ఒకసారి, అర్ధరాత్రి వేళ ఊరవతల వున్న మర్రి చెట్టు ఎక్కి, చిగురుటాకులు కోసుకు రమ్మని పంపాడు. ఈలోగా ఒక మనిషిని భయంకరంగా తయారు చేసి చెట్టుపైన నిలబెట్టాడు. రాము నిర్భయంగా చెట్టెక్కేసరికి, పైన వున్న మనిషి పెద్దగా కేకలు వేసి భయపెట్టాడు. రాము భయపడలేదు సరిగదా, వాడిని లాగి, కిందికి తోసేశాడు. వాడు లబోదిబోమని పరుగెత్తి రాజయ్యకు చెప్పుకున్నాడు.

రాజయ్య రాముని యిలా ఎన్నోవిధాలుగా భయపెట్టాలని చూశాడు. దేనికీ వాడు చలించలేదు.

రాముకి ఇరవై ఏళ్ళు వచ్చాయి. వాడు ఇక్కడ వుంటే ఇక ఏమీ లాభం లేదనీ, ఊళ్ళూ పట్టణాలూ తిరిగితే ఎలాగైనా భయంతో బాటు కొంత లోకజ్ఞానం కూడా నేర్చుకుంటాడనీ రాజయ్య వాడికి కొంత

ఆర్. రేవతి

డబ్బు ఇచ్చి, రెండు మూడు నెలల పాటు తిరిగి రమ్మని పంపాడు.

రాము ఒక పట్టణం చేరుకున్నాడు. అక్కడి వింతలు చూసి రాత్రి కాగానే ఊరిచివర వున్న సత్రంలో నిద్ర పోవడానికి వెళ్ళాడు. సత్రం వేపుగా వెళుతున్న రాముని చూసిన ఒక వ్యక్తి, అటువేపుగా వెళ్ళ వద్దనీ, అర్ధరాత్రి వేళ ఆ ప్రాంతంలో దయ్యాలు తిరుగాడతాయనీ హెచ్చ రించాడు. రాము లక్ష్యపెట్టలేదు.

అర్ధరాత్రి కాగానే దయ్యాలు అటు వేపుగా వచ్చి, రామును చూసి నవ్వాయి. ఆ నవ్వుకు అతను లేచి, ''మీరేనా దయ్యాలు?'' అని అడిగాడు. దయ్యాలు గొల్లుమని నవ్వి రాముని పైకెత్తి పాటలు పాడుతూ ఊరవతల పాడుబడి వున్న పెద్ద భవనానికి తీసుకెళ్ళాయి. దాన్ని దయ్యాలు తమ కోటగా ఉపయోగించుకుంటు న్నాయి. ఆ కోటలో రాజు, అతని భార్య, కూతురూ వుంటారు.

రాముకి దయ్యాలు మోసుకెళ్ళడం వినోదంగా కనిపించింది. లోపలికి తీసు కెళ్ళి అవి అతన్ని ఒక మంచం మీద విసిరేశాయి. మంచం గిర్రున తిరిగింది. రాము '' బలే బలే....బలే - బావుంది !'' అంటూ, ఆనందించసాగాడు.



దయ్యాలకు మతి పోయింది. తాము ఎవరిదగ్గరకెళ్ళినా తమని చూడగానే భయపడతారు. అలాంటిది, వీడు భయ పడలేదు సరిగదా, మంచం తిరుగుతూ వుంటే, వినోదిస్తున్నాడు ! వీడి సంగతి వింతగావున్నదని, ఆ విషయం రాజుగారితో చెప్పాయి. దయ్యాలరాజు జానెడుపొడుగు దానికితోడు మూరెడు గడ్డంతో విచిత్రంగా వుంటాడు. అతను నడుస్తూ వుంటే, గడ్డం నేలమీద జీరాడుతూ వుంటుంది.

రాము సంగతి వినగానే దయ్యాల రాజు కోపంగా మంచం దగ్గరకి వచ్చాడు. అతని ఆకారంచూడగానే రాముకి మరింత వినోదం కలిగింది. అతను చప్పట్లు

చరుస్తూ దయ్యాలరాజు చేతిలో వున్న గొడ్డలిని లాక్కున్నాడు. రాజుకు మరింత కోపం వచ్చి మంచాన్ని బాగా జోరుగా తిప్పినా, అతనికి ఆనందం అధికం అవు తోందే గాని, దేనికీ అతను భయపడడం లేదు. పైగా తన చేతిలో వున్న గొడ్డలితో రాజు గడ్డం మీద కొట్టాడు. ఆ గడ్డం గచ్చులో కూరుకు పోయింది, జానెడు రాజు పైన వేళ్ళాడ సాగాడు.

"బాబోయ్! నన్నులాగేయ్. నీకేం కావాలన్నా ఇస్తాను," అన్నాడు దయ్యాల రాజు. రాము అతని గడ్డాన్ని గచ్చులోంచి గట్టిగా లాగాడు.

"నువు చాలా ధైర్యవంతుడివి. నీలాంటి వాడిని నేను చూడలేదు. నీకు నా దగ్గ రున్న డబ్బు ఇస్తున్నాను తీసుకో. అలాగే నా కూతుర్ని కూడా వివాహం చేసుకో," అన్నాడు దయ్యాలరాజు. అతని కూతురు మనిషే. ఒక రాజు కూతురు. తనకి పిల్లలు లేరని చిన్నప్పుడే దయ్యాల రాజు ఆమెను ఎత్తుకొచ్చాడు. రాము ఆమెను తీసుకుని సరాసరి రాజుగారి కోటకు వెళ్ళాడు.

చిన్నప్పట్నుంచి కనిపించకుండా పోయిన కూతురు, ఒక్కసారి కనిపించ గానే రాజు ఎంతగానో ఆనందించాడు; రాముని అభినందించి, వైభవంగా తన కోటలో ఉత్సవం జరిపాడు. ఆ ఉత్స వానికి రాము తండ్రి కూడా వచ్చాడు. తన కొడుకుకు భయంలేక పోవడం వల్లనే ఇంతటి అదృష్టం పట్టిందని అతను నమ్మినా, అది ఎప్పటికైనా ప్రమాదం కలిగిస్తుందన్న విచారం అతన్ని వదల్లేదు.

"రాముకు భయం తెలియదని మీరు విచారించకండి. ధైర్య సాహసాలు ప్రతి వారికీ వుండవు. అయితే, దాంతోపాటు జాగ్రత్త అనేది అవసరం. అతను ఏ పని చేసినా జాగరూకతతో వుండగలిగితే చాలు; అతను సాధించలేనిది వుండదు. జాగ్రత్త తెలుసుకుంటే అతని జీవితానికే భయమూ లేదు!" అన్నాడు రాజు.






# న్యాయసూత్రం

కొన్నివేల సంవత్సరాలకు పూర్వం ధర్మపాలు డనే రాజు ధవళగిరి రాజ్యాన్ని పరిపాలిస్తూండేవాడు. ఆయన దాన, ధర్మ గుణాలలో సాటిలేనివాడనిపించుకున్నాడు. న్యాయనిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు నా వాడు, యితరుడు అనే భేదభావం ఆయనలో కొంచెమైనా కానవచ్చేదికాదు.

కంటికి కన్ను, పంటికి పన్ను - అనేదే ఆయన న్యాయసూత్రం. కీడు పొందిన వాడెవడైనా, తిరిగి అదే పద్ధతిలో కీడు చేసినవాడిపై పగ తీర్చుకోవచ్చుననే న్యాయం ఆ రాజ్యంలో అమలులో వుండేది.

ఒకనాడు ధర్మపాలుడు నిండు కొలువులో వున్నాడు. మంత్రి, సామంతులంతా సుఖాసీనులై వున్నారు. రాజ్యపాలనకు సంబంధించిన ముఖ్య విషయాలపై చర్చ జరుగుతూ వుంది. ఆ సమయంలో ఒక నాగుబాము దారి తప్పి కొలువులో ప్రవేశించింది.

నాగుబాము కంటపడేసరికి కొలువులో కలకలం బయలుదేరింది. కొందరు కత్తులు దూసి దానిని చంపేందుకు లేచి నిలబడ్డారు. కాని తండ్రి పక్కనే కూర్చుని వున్న యువరాజు అందరినీ వారించి ఖడ్గంతో నాగుబామును రెండు తుండెములుగా నరికాడు.

అలా నరికినప్పటికీ, తల వున్న మొండెముతో నాగుబాము అక్కడి నుంచి పారిపోయి పుట్ట చేరింది. నాగుభార్య, భర్తకు కలిగిన ఈ విపత్తు చూసి శోకించసాగింది. అప్పుడు నాగు తను దారి తప్పి కొలువులోకి వెళ్తే, తనకు యువరాజు చేసిన అపకారం గురించి తెలియపరిచి, "ఈ రాజ్యంలోని కట్టడి నీకు తెలుసు



గదా ? ఆ ప్రకారమే రాజు న్యాయ విచారణ చేసి పుత్రుడికి శిక్ష విధిస్తాడు. ఆ కట్టడివల్ల నేరస్థుడైన యువరాజును నువ్వు కరిచి చంపవచ్చును. కాని, ముందుగా రాజుకు మాత్రం న్యాయ విచారణ జరిపే అవకాశం యివ్వవలసింది. అంతేకాని అనవసరంగా తొందరపడి యువరాజుకు ఎలాంటి హానీ కలిగించవద్దు!'' అని భార్యతో చెప్పి ప్రాణం విడిచాడు.

నాగుభార్య ఆ రాత్రి కోట ప్రవేశించి యువరాజు పడకగది చేరింది. గాఢ నిద్రలో వున్న యువరాజు కంఠానికి చుట్టుకుంది. భయకంపితుడైన యువరాజు మేలుకొని సహాయం కోసం కేకలు పెట్టాడు.

కేకలు విని దాసదాసీలంతా అక్కడికి పరుగెత్తుక వచ్చారు. కాని ఎవ్వరికీ నాగుభార్యను చంపటం ఎలాగో తెలియలేదు. యువరాజు కంఠాన్ని గట్టిగా చుట్టపెట్టుకొని వున్న ఆ పామును కొట్టాలంటే, యువరాజుకూ దెబ్బ తగులుతుంది. అలాంటి స్థితిలో ఏమిచేయటానికీ వాళ్ళకు పాలుపోక కంగారుపడసాగారు.

అప్పుడు నాగుభార్య. ''ముందు రాజుగారిని పిలుచుకు రండి. న్యాయవిచారణ జరగాలి. ఒకవేళ మీలో ఎవరైనా నన్ను చంపయత్నిస్తే యువరాజును కాటువేస్తాను. జాగ్రత్త!'' అంటూ హెచ్చరించింది.

అంతలో రాజుగారు అక్కడకు రానే వచ్చారు. నాగుభార్య తన భర్త మరణాన్ని గురించి రాజుతో చెప్పి, ''నా భర్త ఎవరికీ హాని తలపెట్టలేదు. ఆయనదారిన ఆయన పోతున్నాడు. కాని యువరాజు అన్యాయంగా ఆయనను చంపి నాకు వైధవ్యం కలిగించాడు. ఈ రాజ్య న్యాయసూత్రం ప్రకారం నేను యువరాజును కాటువేసి చంపి, ఆయన భార్యకు వైధవ్యం కలిగించ వచ్చును గదా?'' అన్నది దీనంగా.

నాగుభార్య అలా అనేసరికి రాజు చాలా వ్యాకులపడ్డాడు. న్యాయ చట్టం ప్రకారం, అన్యాయంగా నాగుబామును చంపివేసి ఈమెకు వైధవ్యం కలిగించిన యువరాజు శిక్షార్హుడే అవుతాడు. కాని తనకు అతడు ఒక్కగానొక్క కొడుకు! ధవళగిరికి రాజు కావలసినవాడు! ఈ విపత్తునుంచి బైటపడడంఎలా?

చేసేది ఏమీ లేక రాజు ఇరువురు న్యాయమూర్తులను పిలిపించాడు. వాళ్ళు నాగుభార్య చెప్పినదంతా విన్నారు. తర వాత ఒక న్యాయమూర్తి యిలా చెప్పాడు:

"మహారాజా! కంటికి కన్ను, పంటికి పన్ను, అన్న మన రాజ్య న్యాయచట్టం అందరికీ తెలిసిందే! కనుక యువరాజు వల్ల అపకారం పొందిన నాగుబాము, తన భార్యకు కలిగిన వైధవ్యబాధనే యువ రాణి గారికి కూడా కలిగించవచ్చు!"

నాగుభార్య ఈ తీర్పు విని అనంగీ కార సూచనగా, బుసలుకొడుతూ తల ఆడించింది.

"ఇది ఏ న్యాయశాస్త్రమూ అంగీక రించని తీర్పు. కేవలం నన్ను మోస పుచ్చటానికి, ఈ న్యాయమూర్తులవారు చేస్తున్న ప్రయత్నం. చచ్చిపోయిన నా భర్త ఏ విధంగా యువరాజు భార్యకు వైధవ్యం కలిగించగలడు?" అని అడిగింది నాగుభార్య.

నాగుభార్య అలా ప్రశ్నించేసరికి ఆ న్యాయమూర్తి మరిమాట్లాడలేకపోయాడు.



అప్పుడు రెండవ న్యాయమూర్తి యిలా అన్నాడు: "నాగుభార్య చెప్పినదానిలో సత్యం లేకపోలేదు; అయినా యిక్కడ ఒక ధర్మసందేహం కలుగుతూ వుంది," అంటూ, "అమ్మా, నీకు సంతానం ఎందరు?" అని నాగుభార్యను అడిగాడు.

"నాకు ఐదుగురు పుత్రులు!" అన్నది నాగుభార్య కళ్ళనీళ్ళు పెట్టుకుని.

"అలాగా పాపం! యువరాజు నిన్ను ఐదుగురు పుత్రులు వున్న వితంతువుగా చేశాడన్నమాట! కనుక నువ్వూ ఆయన భార్యను ఐదుగురు పుత్రులున్న వితంతువుగానే చేయాలి! అప్పుడుగాని న్యాయసూత్రాన్ని అనుసరించి శిక్ష విధించినట్టు కాదు. అవునుగదా?" అని అడిగాడు న్యాయమూర్తి.

అందుకు నాగుభార్య, "అవును, అవును!" అన్నది అనుమానిస్తూ.

అప్పుడు న్యాయమూర్తి యిలా చెప్పాడు: "కనుక నువ్వు కొంత కాలం వేచివుండాలి. ఇప్పుడు యువరాణికి యిద్దరే పుత్రులు. ఆమె కూడా ఐదుగురు పుత్రుల తల్లి అయిన తరవాత నువ్వు నిరభ్యంతరంగా యువరాజు మీద పగ తీర్చుకోవచ్చు."

ఈ తీర్పు న్యాయసూత్రానికి అనుగుణంగానే వుందని నాగుభార్య అంగీకరించక తప్పలేదు. అందువల్ల ఆమె రాజును ఒక్కకోర్కె కోరింది. యువరాణికి ఐదవ సంతానం కలగగానే తనకు ఆ వర్తమానం పంపమన్నది.

న్యాయశీలి అయిన రాజు సరే అన్నాడు. కాని యువరాణికి ఆ తరవాత సంతానమే కలగలేదు.

నాగుభార్య మాత్రం, ఆ దంపతులు ఉద్యానవనం లోకి వచ్చినప్పుడల్లా తన పుట్టలోనుంచి తొంగి చూసేది.

ఎంతకాలం జరిగినా, వాళ్ళ వెంట యిద్దరు పిల్లలకంటె ఎక్కువ కనబడలేదు. యిక నా పగ తీరటం ఎలా? అనుకొనేది నాగు భార్య. కొంతకాలానికి తన పగ తీరకుండానే మరణించింది.





# జ్ఞాతివైరం

పూర్వం కాశీరాజ్యాన్ని పాలించిన బ్రహ్మదత్తుడికి, నూరుగురు కొడుకులు. అందరిలో కడగొట్టువాడిపేరు, సంవరుడు. రాజు తన కొడుకులలో ఒక్కొక్కణ్ణి ఒక గురువు దగ్గరకు విద్యాభ్యాసానికి పంపాడు. చిన్నవాడైన సంవరుడికి బోధిసత్వుడు గురువు.

మహాజ్ఞాని అయిన బోధిసత్వుడి దగ్గర సంవరుడు చాలా కాలం విద్యాభ్యాసం చేసి, అన్ని విద్యలలోనూ ఆరితేరాడు. కొంతకాలం తరవాత రాజకుమారులకు గురువులైన వాళ్ళందరూ, తమ శిష్యులను రాజు దగ్గరకు తీసుకుపోయి, ''మహారాజా, తమ పుత్రులు సకల విద్యాపారంగతులయ్యారు,'' అని చెప్పి, రాజు నుంచి ఘనంగా సన్మానాలు పొందారు.

రాజు, తన కుమారులను రాజ్యంలోని పలు ప్రాంతాలకు పాలకులుగా ప్రకటించి, వాళ్ళను రాజధానీ నగరం నుంచి పంపివేశాడు. సంవరుడు, గురువును, ''నా తండ్రి, నా అన్నలకు లాగే, నాకూ రాజ్యంలోని ఏదో ఒక ప్రాంతాన్ని యిచ్చి, పరిపాలకుడుగా వెళ్ళమంటే, నేనేం చేయాలి?'' అని అడిగాడు.

శిష్యుడి ప్రశ్నకు బోధిసత్వుడు, ''నాయనా, నీ తండ్రి ఒకవేళ నీకు రాజ్యం యిస్తానంటే, అందుకు అంగీకరించకు. నీ అన్నలందరూ, తండ్రిని వదిలి తలా ఒక ప్రాంతం వెళ్లిపోయారు. తండ్రిని కనిపెట్టుకుని వుంటూ, ఆయనను భక్తితో సేవించటం, నీ విధి.'' అన్నాడు.

రాజు ఒకనాడు బోధిసత్వుడి ఆశ్రమానికి వచ్చాడు. సంవరుడు తండ్రికి నమస్కరించి, గురువు పక్కన నిలబడ్డాడు. రాజు, అతణ్ణి, ''బాబూ, నీ విద్య పూర్తయిందా?'' అని అడిగాడు.

జాతకకథ



దగ్గిరే వుండసాగాడు. అవసరం అయినప్పుడు అతడు బోధిసత్వుడి సలహాలు పొందుతూండేవాడు.

ఒకసారి బోధిసత్వుడి సలహాప్రకారం సంవరుడు కొంత బీడుభూమిని బాగు చేయించి, అందులో పూలచెట్లనూ, ఫలవృక్షాలనూ పెంచి, దాన్ని చక్కని ఉద్యానవనంగా తయారుచేశాడు. ఆ ఉద్యానంలోకి పురప్రముఖులు ఎందరో వస్తూండేవాళ్ళు. వారితో సంవరుడికి పరిచయం కలిగింది.

మరొకసారి తండ్రి అనుమతి తీసుకుని సంవరుడు నగరంలోని అన్ని వర్ణాలవారికీ సంతర్పణ చేయించాడు. తరవాత రాజాశ్రితులకూ, రాజ్యంలోని కాల్బల, అశ్వదళ సైనికులకూ గొప్పగా విందు చేశాడు. విదేశాల నుంచి వచ్చే రాయబారులకూ, వర్తకులకూ సౌకర్యం కోసం, అన్ని వసతులూ గల చక్కని భవనాలు కట్టించాడు. ఈ కారణాలవల్ల సంవరుడి కీర్తిప్రతిష్ఠలు రాజ్యంలో ఎంతగానో పెరిగినై.

ఇలా కొంతకాలం గడిచింది. బాగా వృద్ధుడైపోయిన రాజుకు అవసానకాలం సమీపించింది. ఆయన మంత్రులను పిలిపించి, "నా తదనంతరం, నా నూరుగురు పుత్రులలో ఎవరికైనా సింహాసనం ఎక్కే హక్కున్నది. కనక, మీరు బాగా

"నాన్నగారూ! గురువుగారి దయ వల్ల అన్ని విద్యలూ నేర్చుకున్నాను," అన్నాడు సంవరుడు.

"అలా అయితే, నువు పరిపాలించేందుకు, రాజ్యంలో నీ యిష్టమైన ప్రాంతాన్ని కోరుకో," అన్నాడు రాజు.

"నేను అందరిలోనూ కడగొట్టువాడిని. నేను రాజ్యం పంచుకుపోతే, మిమ్మల్ని కనిపెట్టుకుని వుండే వారెవరు? నాకు రాజ్యంతో పనిలేదు. మీకు సేవచేస్తూ, కాలం గడపటమే నేను కోరుకునేది," అన్నాడు సంవరుడు.

రాజు ఆ జవాబుకు చాలా సంతోషించాడు. సంవరుడు ఆనాటి నుంచీ తండ్రి

ఆలోచించి వారిలో అర్హుడైనవాడికి పట్టం కట్టండి,'' అని చెప్పాడు.

రాజు చనిపోయాక, మంత్రులందరూ చర్చించుకుని, సింహాసనం ఎక్కదగిన వాడు సంవరుడే అని నిర్ణయించి, అతడికి వైభవంగా రాజ్యాభిషేకం చేశారు. ఆనాటి నుంచీ సంవరుడు, తన గురువైన బోధిసత్వుడి సలహాలు పొందుతూ, న్యాయమార్గాన రాజ్యపాలన చేయ సాగాడు.



సంవరుడు తమ తండ్రి తదనంతరం రాజవటం, మిగిలిన తొంభైతొమ్మిదిమంది రాజకుమారులకూ కోపకారణం అయింది. వాళ్ళందరూ కూడబలుక్కుని, ఒక దూత ద్వారా సంవరుడికి సింహాసనం వదులుకోమని హెచ్చరిక పంపి, సైన్యాలతో వచ్చి, కోటను ముట్టడించారు.

సంవరుడు, యీ సంగతి గురువైన బోధిసత్వుడికి తెలియచేశాడు. బోధిసత్వుడు అతడితో, ''సోదరులతో కలహించటం మహాపాపం. అందువల్ల నీ తండ్రి ఆస్తిని నూరు భాగాలు చేసి, నీ అన్నలకు ఎవరిభాగం వాళ్ళకు యిచ్చెయ్యి,'' అన్నాడు.

సంవరుడు అలాగే చేశాడు. ఈ సత్ప్రవర్తన అందరిలోకీ జ్యేష్ఠుడైన ఉపోసతుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. అతడు, తన తమ్ములతో, ''సింహాసనాన్ని సొంతం చేసుకోవటం ద్వారా, తమ్ముడు శత్రువయ్యాడని భావించి, వాడిచేయ వచ్చాం. కాని, అతడు న్యాయంగా ప్రవర్తించటం ద్వారా, ప్రజలందరి మెప్పు పొందాడు. అలాంటి వాడిపైన మనం యుద్ధం చేయుటం ఎలా?'' అన్నాడు.

''అయితే, యిప్పుడు మనం చేయవలసిందేమిటి?'' అని అడిగాడు, తమ్ములలో ఒకడు.

''మన తమ్ముడితో రాజీపడటం ఉత్తమ మార్గంగా, నాకు తోస్తున్నది. తండ్రిగారి సింహాసనానికి మనం అందరం

హక్కుదారులం అన్న మాట నిజమే. కాని, అందరం రాజ్యానికి రాజులం ఒకే సారి కాలేం కదా. అందువల్ల సంవరుడిని రాజుగా అంగీకరించి, మనకు వచ్చిన రాజ్యభాగాలను, తిరిగి అతడి పరం చేయటం న్యాయం అనిపించుకుంటుంది,'' అన్నాడు ఉపోసతుడు.

ఆ మాటలకు తమ్ములందరూ తమ సమ్మతి తెలిపారు. వెంటనే వాళ్ళందరూ తమ సైన్యాలతో సంవరుడికి జేజేలు పలుకుతూ, నగరం ప్రవేశించారు. సింహాసనాసీనుడై వున్న సంవరుడు, అన్నలందరికీ స్వాగతం చెప్పి, వాళ్ళకు ఉచితాసనాలు ఏర్పాటు చేశాడు.

ఉపోసతుడు, సంవరుడితో, ''తమ్ముడూ, నీ ధర్మగుణం వేనోళ్ళ కీర్తించదగింది. అందరితోనూ యింత మంచిగా వుండగలశక్తి, నీకెలా అలవడింది?'' అన్నాడు.

''అన్నా! నువ్వనే ఆ శక్తి, బహుశా నేను తోటి మానవుణ్ణెవణ్ణీ ద్వేషించని కారణంగా కలిగి వుంటుంది. ఇక రాజ్య పాలన విషయంలో, పరివారానికి ఎప్పటికప్పుడు జీతాలు పూర్తిగా యిచ్చేస్తాను. మన రాజ్యానికి వచ్చే రాయబారులనూ, వర్తకులనూ తగినవిధంగా గౌరవిస్తాను. ప్రజల క్షేమమే, నా క్షేమంగా భావిస్తాను,'' అన్నాడు సంవరుడు.

అప్పుడు ఉపోసతుడు, మిగిలిన తన తమ్ముల అందరి పక్షానా, సంవరుడిని దీవించి, ''ఇదే విధంగా ధర్మమార్గాన రాజ్యం పాలిస్తూ, కీర్తిగడించు. నీ అన్నలమైన మేమందరమూ, నీకు సహాయంగా వుంటూ శత్రుభయం లేకుండా చూస్తాము. ఈ భూలోకంలోనే, నీవు దేవేంద్రపదవి అనుభవించు,'' అన్నాడు.

బోధిసత్త్వుడి శిష్యుడైన సంవరుడు, యీ విధంగా అన్నల నుంచి ప్రేమాదరాలూ, ప్రజల నుంచి గౌరవమర్యాదలూ పొందాడు. ఆ తరవాత ఎంతో కాలం ప్రజాక్షేమంగా రాజ్యపాలన చేసి, గొప్పరాజన్న కీర్తి గడించాడు.






# సాహసయాత్ర

కౌండిన్యు డనే బ్రాహ్మణ యువకుడికి, ఎన్నో తరాలుగా తమ కుటుంబ వృత్తి అయిన పౌరోహిత్యం, పురాణ పఠనం లాంటి వాటిల్లో, ఏ మాత్రం ఆసక్తి వుండేది కాదు. తండ్రి భక్తిశ్రద్ధలతో శ్లోకాలు వల్లె వేస్తూండగా, కౌండిన్యుడు చల్లగా ఇంటి నుంచి బయటికి వెళ్ళి పోయేవాడు.

కౌండిన్యుడు సముద్రతీరాన కూర్చుని, అపారమైన ఆ సముద్రజలం ఆవల ఏమున్నదని ఆశ్చర్యపడుతూండేవాడు. తానేదైనా గొప్ప సాహస, వీరోచిత కార్యాలు చేయాలని తపన పడుతూండేవాడు.





ఒక రాత్రి అతడు గాఢనిద్రలో ఉండగా కలలో ఒక మహారణ్యం కనిపించింది. ఆ అరణ్యంలో ఒక దివ్యపురుషుడు— మహాభారత కథలోని వీరుడిలాంటివాడు, ఒక ధనుస్సును కొండగుహలో పెట్టడం కంటబడింది. కౌండిన్యుడు చప్పున మేల్కొన్నాడు



సూర్యోదయం అవుతూండగానే కౌండిన్యుడు అరణ్యానికి పోయి, కలలో తాను చూసిన కొండగుహను గుర్తించాడు. అతడు నిశ్శబ్దంగా గుహలో ప్రవేశించి, అక్కడ కనిపించిన ధనుస్సును చూసి అబ్బురపాటు చెందాడు.



ఆ ధనుస్సు తీసుకుని అతడు తిరిగి వచ్చి, తన స్నేహితుల ఎదట తన విలువిద్యాకౌశల్యం ప్రదర్శించి, వాళ్ళను ఆశ్చర్యచకితుల్ని చేశాడు. మహత్తుగల ఆ ధనుస్సు తన చేతిలో వుండగా, తాను సాధించలేని కార్యం వుండదని, అతడికి నమ్మకం కలిగింది.



కౌండిన్యుడు తన మిత్రులను కొందరిని కూడగట్టుకుని, తీరంలో పనికిరాకుండా పడివున్న ఒక నావను మరమ్మత్తులు చేసి, మిత్రులతో పాటు, తానెక్కడికి పోతున్నదీ కూడా ఆలోచించకుండా, సముద్రం మీద బయలు దేరాడు. రోజులు గడిచిపోతున్నవి.

కొన్నాళ్ళ తర్వాత వాళ్ళకు కొబ్బరి చెట్లతో క్రిక్కిరిసి వున్న ఒక సముద్ర తీరం, దాని వెంట ప్రయాణిస్తున్న సాలంకృతమైన ఒక నావా కంటబడినై. కౌండిన్యుడు ధనుస్సు ఎక్కుపెట్టి, ఆ నావ మీద రెపరెపలాడుతున్న జెండా కేసి బాణం వదిలాడు. బాణం తగలగానే జెండా తెగి, కిందపడింది.





ఆ మరుక్షణం నావలో కలకలం బయలుదేరింది. చాలా మంది యువతులు నావలో లేచి నిలబడ్డారు. వాళ్ళల్లో రాకుమారి లాంటి అద్భుతసౌందర్యవతి, కౌండిన్యుడి కేసి చేయి వూపుతూ తమ నావను అనుసరించి రమ్మన్నట్టుగా సౌంజ్ఞ చేసింది.

తండ్రి మరణానంతరం ఆ తీరప్రాంతాన గల కాంభోజరాజ్యానికి ఆ రాకుమారి పరిపాలకురాలైంది. కౌండిన్యుణ్ణి చూస్తూనే, అతడు తనకు తగిన భర్త అని ఆమె నిశ్చయించుకున్నది. ఆమెను వివాహమాడి కౌండిన్యుడు కాంభోజ రాజ్యానికి రాజయాడు.





ఆనాటి కాంభోజ, తరవాత కంబోడియాగా మారి, యిప్పుడు కంపూచియాగా వ్యవహరించబడుతున్నది. కౌండిన్యుడి పరిపాలనారంభం నుంచి ఆ దేశంలో భారతీయసంస్కృతి వేళ్ళు తొక్కుకున్నది. భారత, కాంభోజ దేశాల మధ్య వర్తక వ్యాపారాలు విరివిగా కొనసాగినై.

కాంభోజలో లభ్యమైన ఒక శాసనం ద్వారా తెలుస్తున్నదేమంటే, కౌండిన్యుడి వంశస్థులైన రాజులకు వర్మ అనే బిరుద నామం వుండేది. వాళ్ళ పరిపాలనా కాలంలో ఎన్నో దేవాలయాలు నిర్మించబడినవి.





అలాంటి దేవాలయాల్లో సుప్రసిద్ధమైనది అంగ్‌కార్ వాథ్. అది పూర్వం యశోధరాపుగం అని పిలవబడి యిప్పుడు అంగ్‌కార్ థోమ్ అనబడుతున్న నగరంలో నిర్మించబడింది. ఆ దేవాలయ శిల్పానికి సాటివచ్చేది మరెక్కడా లేదన్నది అతిశయోక్తి మాత్రం కాదు.



# సందేహనివృత్తి

ఒకనాడు విదర్భరాజైన ప్రసేనుడు కొలువుతీరి వుండగా, ఒక వార్తాహరుడు వచ్చి, రాజుతో తమ యిరుగు, పొరుగు రాజ్యాలైన అవంతీ, మణిపురాల మధ్య జరిగిన యుద్ధంలో విశేషంగా జననష్టం జరిగింధనీ, గ్రామాలకు గ్రామాలే ధ్వంస మైపోయాయనీ చెప్పాడు.

అంతవరకూ రాజుగారి విదూషకుడి హాస్యసంభాషణలతో వినోదిస్తున్న సభికులు, యీ వార్త విని దిగాలు పడిపోతూ కొంతసేపు మౌనంగా వూరుకున్నారు. హఠాత్తుగా విదూషకుడు ఒక చావుకేక పెట్టి, తలపాగాను నేలకు కొట్టి, చిందులు వేయసాగాడు. తలపాగాలో చేరిన తేలు విదూషకుణ్ణి కుట్టింది. అతడి బాధచూసి సభికులు గొల్లుమంటూ నవ్వారు.

ఇదంతా గమనిస్తున్న రాజు ప్రసేనుడు, తన మంత్రి సుబుద్ధితో, "మహామంత్రీ! అక్కడెక్కడో పొరుగురాజ్యంలో జరిగిన ప్రాణనష్టాల సంగతి విని, విచారంతో మౌనం వహించిన సభికులు, విదూషకుడి బాధ చూసి పొట్టలు చెక్కలయేలా నవ్వారు. మనుషుల్ని ఎక్కువగా బాధ పెట్టేదేమిటో, ఆనందపరిచేదేమిటో తెలుసుకోవాలనిపిస్తున్నది," అన్నాడు.

మంత్రి ఒక క్షణం ఆలోచించి, "మహారాజా, మనిషికి శారీరక, మానసిక మైన బాధల్లో భరించరానిది మానసిక బాధే! ముక్కూ, మొహం తెలియని వాళ్ళయినా, యుద్ధకారణంగా వందలాది జనం చచ్చిపోయారనే వార్త విన్నప్పుడు సభికుల మనస్సులు వివశత్వం చెందిన కారణంగా, మౌనంగా వుండిపోయారు. కాని, రోజూ తమను నవ్వించే విదూషకుడు బాధతో కేకలు పెట్టడం, వాళ్ళకు నవ్వు తెప్పించింది," అన్నాడు.

ఎమ్. డి. సౌజన్య

"మీరు చెప్పేదాన్నిబట్టి శారీరక, మానసిక బాధల మధ్య వుండే తేడా చాలా సూక్ష్మం అని పిస్తున్నది. వీటిలో మానసిక బాధ భరింపరానిదని రుజువు చేయగలరా?" అని అడిగాడు రాజు.

మంత్రి తాను రుజువు చేయగలననీ, అందుకు రాజుగారి సహకారం కావాలనీ అన్నాడు. రాజు సరేనన్నాడు.

మంత్రి ఒక వృద్ధుడి వేషంలో నగరం వెలపల వున్న కాళికాలయానికి వెళ్ళాడు.

చాలామంది భక్తులు ఆలయానికి వచ్చి రకరకాల కోర్కెలు కోరి, దేవికి ప్రణమిల్లి వెళ్ళిపోసాగారు. అలాంటి వారిలో వికటాక్షుడనే యువసన్యాసిని పరీక్షించాలనుకున్నాడు మంత్రి.

ఈ వికటాక్షుడు పరమ బద్ధకస్థుడు. ఏ పనీ చేయకుండా కాలం గడపవచ్చునని సన్యాసి అయాడు. అతడు బద్ధకం కొద్దీ మఠంలోని యితర సన్యాసులతో పాటు నదికి స్నానానికి పోక, కొంత ఆలస్యంగా వెళ్ళి స్నానం చేసి, తిరిగి వస్తున్నాడు. దారిలోని ఇసుకలో ఒక చోట అతడికి కళ్ళు చెదిరే కాంతితో ఒక వజ్రపుటుంగరం కనిపించింది.

అతడు ఉంగరం తీసుకుని కొద్ది దూరం నడిచేంతలో ఒక వృద్ధుడు దేనికోసమో వెతుకుతూ, "అయ్యో, యిక నా కుమారుడి భవిష్యత్తు సర్వనాశనమైనట్టే! నేను బతికి మాత్రం ప్రయోజనం ఏమిటి?" అంటూ ఆక్రోశిస్తున్నాడు.



ఆ వృద్ధుడు వెతుకుతున్నది, తనకు దొరికిన వజ్రపుటుంగరం కోసమే అని వికటాక్షుడు గ్రహించాడు. అతడు, ఆ వృద్ధుణ్ణి సమీపించి, అతడు ధరించిన విలువైన దుస్తులూ, మెడలో వున్న రత్నాలహారం చూసి ఆశ్చర్యపోతూ, "దేని కోసం వెతుకుతున్నారు?" అని అడిగాడు.

"ఈ ప్రాంతాల ఎక్కడో నా వజ్రపు టుంగరం పడిపోయింది. నావి కొంచెం ఛత్వారపు కళ్ళు. దాన్ని వెతికి పెట్టావంటే, నా రత్నాలహారం నీకు బహూకరిస్తాను," అన్నాడు వృద్ధుడు.

వికటాక్షుడు ఉంగరం కోసం వెతుకుతున్నట్టు నటిస్తూ, దాన్ని కింద పడవేసి, తిరిగి చేతికి తీసుకుని వృద్ధుడికి యిచ్చాడు. వృద్ధుడు అతడికి తన మెడలోని రత్నాలహారం తీసి యిచ్చి, అక్కడి నుంచి కదిలాడు.

వృద్ధుడు కొంచెం దూరం పోయాక, వికటాక్షుడికి హఠాత్తుగా ఒక అనుమానం కలిగింది. అతడు గబగబా వృద్ధుణ్ణి సమీపించి, "అయ్యా, మీరు పోగొట్టుకున్న ఉంగరం కన్న, యీ రత్నాల హారం ఎక్కువ విలువగలదనుకుంటాను, అవునా?" అన్నాడు.

"నాయనా, ఆ మాట నిజమే. కాని, ఈ ఉంగరం మహత్తుగలది, కాళీదేవి ప్రసాదితం. దాన్ని ధరించినవాడు రాజుగారికి అల్లుడై, ఆయన తదనంతరం రాజవుతాడు. ఈ ఉంగరాన్ని నా కుమారు



డికి యివ్వబోతున్నాను,'' అన్నాడు వృద్ధుడు.

ఆ మరుక్షణం వికటాక్షుడు, వృద్ధుడి నుంచి ఉంగరం లాక్కుని, ''ఈ ఉంగరం ధరించి నేనే, ప్రసేనరాజుగారి అల్లుణ్ణీ, రాజ్యానికి వారసుణ్ణీ అవుతాను,'' అంటూ నగరం కేసి బయలుదేరాడు.

వృద్ధుడి వేషంలో వున్న మంత్రి అతణ్ణి అనుసరించాడు.

ఇద్దరూ వెళ్ళేసరికి రాజు సభతీరి వున్నాడు. వికటాక్షుడు పట్టరాని ఉత్సాహంతో తాను వజ్రపుటుంగరాన్ని ధరించిన వేలిని రాజుకేసి చూపుతూ, ''మహారాజా, నా పేరు వికటాక్షుడు. ఈ వేలికి వున్న ఉంగరం, కాళికాదేవి ప్రసాదించినది!'' అన్నాడు.

''అలాగా!'' అన్నాడు రాజు, ఏ మాత్రం ఆశ్చర్యపడకుండా.

''ఈ ఉంగరం ధరించినవాడు తమకు అల్లుడవటమే గాక, తరవాత సింహాసనాన్ని కూడా అధిష్ఠిస్తాడు. దీని మహత్తు, తమ మీద ఏమీ పని చెయ్యడం లేదా?'' అని అడిగాడు వికటాక్షుడు.

''మహత్తా! ఆ మహత్తేదో పని చేయడం జరిగితే, నిన్ను సింహాసనం దగ్గిరకు ఆహ్వానించేవాణ్ణి గదా?'' అన్నాడు రాజు.

వికటాక్షుడు వెలవెలపోతూ చూసేంతలో, మంత్రి రాజును సమీపించి, తన పెట్టుడు గడ్డం తీసివేస్తూ, ''మహారాజా, యీ నాటకం ఆడినవాణ్ణి నేనే. ఈ యువసన్యాసి కొండంత ఆశతో యిక్కడికి వచ్చాడు, పాపం!'' అన్నాడు.

ఆ వెంటనే వికటాక్షుడు ఒక కేక పెట్టి, మూర్ఛతో దభీమంటూ కింద పడిపోయాడు. మంత్రి, భటులతో వికటాక్షుణ్ణి వైద్యుడి దగ్గిరకు తీసుకుపొమ్మని చెప్పి, రాజుతో, ''చూశారా, మహారాజా! ఇతడికి మనం చిన్న మెత్తు శారీరకబాధ కలిగించలేదు. కాని, మానసికమైన ఆశాభంగంతో మూర్ఛపోయాడు,'' అన్నాడు.

తన సందేహనివృత్తి అయిందన్న సూచనగా రాజు తృప్తిగా తలాడించాడు.



# నమ్మకం!

ఒక సన్యాసి, సకాలంలో వర్షాలు లేక ప్రజలు అవస్థలపాలై వున్న ప్రాంతాల తిరుగుతూ ఒక గ్రామం చేరి, చెరువు గట్టుమీది చెట్టు కింద మకాం పెట్టాడు. గ్రామస్థులు ఆయన్ని చూడవచ్చి, తమ గోడు చెప్పుకున్నారు.

సన్యాసి వాళ్ళతో, "ఈ రోజు గురువారం కదా? వచ్చే గురువారానికి ఎడ తెరిపిలేని వానలు కురిపించగలను. అయితే, అందుకు జప, తప, హోమాల్లాంటివి చేయాలి. డబ్బు ఖర్చవుతుంది. నా మీద పూర్తినమ్మకం వున్నవాళ్ళు మాత్రమే చందాలివ్వండి," అన్నాడు.

చందా డబ్బు బాగా వసూలైంది. సన్యాసి పూజలూ అవీ ప్రారంభించాడు. తిరిగి గురువారం వచ్చింది. వానలు కురవకపోగా ఎండా, వడగాడ్పూ మరి కాస్త ఉధృతం అయింది. జనం సన్యాసిని నానా మాటలూ అన్నారు.

సన్యాసి చిరునవ్వు నవ్వి, "నేను వాన కురిపించగలనని, మీరెవరూ నమ్మలేదు. అలాంటి నమ్మకం మీకున్నట్లయితే, యీ పాటికి పొలాలు దున్ని, వానలు పడగానే నాట్లు వేసేందుకు, నారుమళ్ళు కూడా వేసి వుండేవాళ్ళు. ఇక యిక్కడ నా కాలాన్ని వృథా చెయ్యదలచలేదు," అంటూ మరొక గ్రామానికి బయలుదేరాడు.

—వి. ఇందిరాదేవి





# పందెం భీమయ్య

ఎలాంటి పందెమైనా వేసి నెగ్గగలడని భీమయ్యకు పేరు ఉండేది. ఒకరోజు అతను ఎల్లయ్య అనే వాడితో మాట్లాడు తూండగా ఆ ఊరి మునసబు ప్రసక్తి వచ్చింది.

"మునసబు ధర్మాత్ముడు!" అన్నాడు ఎల్లయ్య.

"ఆయనేం ధర్మాత్ముడు? అందరి దగ్గిరా లంచాలు తీసుకుని తెగబలిశాడు. అందుకే నేను రోజూ, చెడామడా తిడుతున్నా, పల్లెత్తు మాట అనకుండా పడతాడు!" అన్నాడు భీమయ్య.

మునసబు పరమ కోపిష్ఠి. ఈ సంగతి ఎల్లయ్యకు తెలుసు. అందుకని వాడు భీమయ్య మాటలు నమ్మనన్నాడు.

పందెం కాయమన్నాడు భీమయ్య.

"నేను వింటుండగా నువు మునసబును తిట్టాలి. మునసబు నీ తిట్లు పడాలి. అలా జరిగేటట్టుంటే నేను నీకు వందరూపాయలు ఇస్తాను," అన్నాడు ఎల్లయ్య.

"సరే, అయితే, స్నానం చేసి వస్తాను ఉండు," అని భీమయ్య లోపలికి పోయి, కాస్సేపటికి బయటికి వచ్చి, "నేను మునసబును తిట్టుతూంటే నువు ఒక్క మాట కూడా మాట్లాడకూడదు మరి!" అన్నాడు.

ఎల్లయ్య సరేనన్నాడు.

ఇద్దరూ కలిసి కొంతదూరం వెళ్ళాక భీమయ్య ఎల్లయ్యతో, "పందెం నెగ్గటానికి నా పద్ధతులు నా కుంటాయి. ముందు నన్ను వెళ్ళనీ. కాసేపాగి నువురా. నువు వచ్చేసరికి నేను మునసబును రకరకాలుగా తిట్టుతుంటాను. ఆయన అవన్నీ శాంతంగా వింటూంటాడు." అన్నాడు.

"వసుంధర"

ఎల్లయ్య సరేనని వెనక్కు తగ్గాడు. మునసబుకు డబ్బు కక్కుర్తి లేదనీ, ఎంత డబ్బిచ్చినా తిట్లు పడడనీ వాడికి తెలుసు.

కొంచెంసేపు ఆగి ఎల్లయ్య మునసబు ఇంటికి వెళ్ళేసరికి భీమయ్య మునసబును నానా మాటలూ అంటున్నాడు. "నువు లంచగొండివి! ఊళ్ళో నువు చేసే అన్యాయాలకూ, అక్రమాలకూ అంతులేదు! నువు పోతేతప్ప ఈ ఊరు బాగుపడదు!"

మునసబు శాంతంగా భీమయ్య అనే మాటలు వింటూ, "అనవసరంగా ఆవేశ పడకు, భీమయ్యా. నువు కాస్సేపు అలా కూర్చో. స్థిమితపడు. మజ్జిగతాగి వెళుదువు గాని," అంటున్నాడు.

భీమయ్య వినిపించుకోకుండా రెచ్చిపోతున్నాడు. ఎల్లయ్య ఈ చిత్రం చూస్తూ అలాగే నిలబడ్డాడు. పరమ కోపిష్ఠి అని పేరుబడ్డ మునసబు అన్ని మాటలు పడి, అంత శాంతంగా ఉండడం చూసి వాడికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఒకవేళ మునసబు నిజంగా అక్రమాలు చేస్తున్నాడేమోనన్న అనుమానం కూడా వాడికి కలిగింది. ఈ ఆలోచన రాగానే వాడు బాధపడ్డాడు; ఎందుకంటే వాడికి మునసబు అంటే ఎంతో భక్తి.

తిట్టి తిట్టి, అలసిపోయి, కాసేపటికి చతికిలబడ్డాడు భీమయ్య. భీమయ్యకు మజ్జిగ ఇయ్యమని మునసబు తన పెళ్ళానికి కబురు పెట్టాడు. ఆవిడ భీమయ్యకు



మజ్జిగ తెచ్చి ఇస్తూ, వాడి చేతిలో వంద రూపాయలు పెట్టింది.

"ఆ డబ్బు ఏమిటే?" అని మునసబు అడిగాడు.

"ఎల్లయ్యకు మీరంటే ఎంతో భక్తీ గౌరవమూ కదా; మిమ్మల్ని ఎవరైనా పల్లెత్తు మాట అంటే సహించలేడు గదా! ఆ మాటే నేను అనేసరికి, భీమయ్య అదేమీ లేదనీ, మిమ్మల్ని ఎవరైనా తిట్టినా వాడు చూస్తూ ఊరుకుంటాడనీ అన్నాడు. వందరూపాయలు పందెం కాసి, ఓడిపోయాను!" అన్నది మునసబు భార్య.

మునసబు ఎల్లయ్య కేసి తిరిగి, "ఏరా ఎల్లయ్యా? భీమయ్యకు పిచ్చిపట్టినట్టు నీకు తెలుసునేమిటి?" అని అడిగాడు.

ఎల్లయ్య ఆశ్చర్యంగా, "భీమయ్యకు పిచ్చేమిటండీ?" అన్నాడు.

"నీకు తెలియదా? వీడికి ఉన్నట్టుండి తిక్కరేగుతుందనీ అప్పుడు ఎవరిని పడితే వాళ్ళను నోటికి వచ్చిన మాటలు అంటున్నాడనీ, ఎదురు చెబితే మరీ రెచ్చిపోతాడనీ, శాంతంగా సర్దిచెప్పి, కాస్త మజ్జిగ దాహం ఇస్తే, తేరుకుని మళ్ళీ మామూలు మనిషి అవుతాడనీ, కొంత సేపటి క్రితం ఒక మనిషి వచ్చి, నాకు చెప్పి వెళ్ళాడు!" అన్నాడు మునసబు.

"ఇలా నాలుగు రోజులనుంచి జరుగుతున్నదిటగా?" అన్నది మునసబు భార్య.

భీమయ్య స్నానం చేసి వస్తానని లోపలికి వెళ్ళిన సమయంలో ఈ అబద్ధం మునసబుకు చేరవేసి ఉంటాడని ఎల్లయ్య గ్రహించాడు. వాడు నోరు తెరిచే లోగా భీమయ్య వాణ్ణి సమీపించి, వంద రూపాయలూ తీసుకుని, మెరుపు వేగంతో అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

తరవాత మునసబు ఎల్లయ్య ద్వారా నిజం తెలుసుకుని, ఈ విషయం తనకు చెప్పకపోగా, నిలబడి చోద్యం చూస్తూ ఉండిపోయినందుకు ఎల్లయ్య మీదనే చిందులు తొక్కాడు.





# ఇద్దరు మోసగత్తెలు

## 4

బగ్దాదు నగరానికి వస్తున్నవాడు, "బగ్దాదులో అన్నిటినీ మించి అనుభవించదగిన దేమిటి?" అని వెళ్ళేవాణ్ణి అడిగాడు.

"మీగడ పూసిన తేనె రొట్టెలు! నేనీ నగరంలో ఉన్న మూడు రోజులూ అవే తిన్నాను. ఏదైనా తనివితీరుతుంది గాని, అవి మాత్రం ఎంత తిన్నా తనివి తీరవు. ఇంకా తినాలనిపిస్తుంది," అన్నాడు వెళ్ళేవాడు.

"భేష్! ఎంత ఖర్చయినా సరే నేను ఈ నగరంలో ఉన్నన్నాళ్లూ మీగడ పూసిన తేనె రొట్టెలే తింటాను," అన్నాడు వచ్చేవాడు. వెళ్ళేవాడు వెళ్లిపోయాడు. వచ్చేవాడు దిలైలా వున్న దిక్కుగా వచ్చాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న దిలైలా అప్పటికప్పుడే ఒక యుక్తి ఆలోచించింది. ఆ యుక్తి పారితే తాను తప్పించుకు పారిపోవచ్చు. ఈ వచ్చేవాడు పరదేశీ. వాడికి తానెవరో, తన కథ ఏమిటో తెలియదు. అందుచేత వాడు సులువుగా మోసపోవచ్చు. ఇలా ఆలోచించి, దిలైలా, "నాకు వద్దు! నేను తినను!" అనటం ఆరంభించింది. అతను దగ్గరకు వచ్చి, "ఏమిటమ్మా, ఎవరు నువు? ఎందుకిక్కడ నిన్ను కట్టి ఉంచారు? ఏమిటి వద్దంటున్నావు?" అని అడిగాడు

"ఏం చెప్పేది, నాయనా? నా భర్త తేనె రొట్టెలు తయారుచేసి వాటి మీద మీగడ పూసి అమ్మి, లక్షలు గడించాడు. మొదట్లో నాకవి ఇష్టమేగాని రాను రాను మొహం మొత్తిపోయింది. మొన్న ఒక నాడు మా దుకాణానికి ఎవరో గొప్పవారు వస్తే నా భర్త నన్ను కూడా వారితోబాటు



తేనె రొట్టెలు తెస్తారు. అవి అందరూ చూస్తుండగా తిన్నదాకా నాకు భోజనం పెట్టరు. నా కష్టం ఏమని అడుగుతావు, నాయనా!'' అన్నది దిలైలా.

''అయ్యో, అవ్వా! పాపం, నీకెంత కష్టమొచ్చింది! ఆ కష్టం నాకైనా రాక పోయెనే?'' అన్నాడు కొత్తవాడు.

''అదేం భాగ్యం, నాయనా? నా కట్టు విడిపించితివా, నా స్థానంలో నిన్ను కట్టే స్తాను. నాలాగే నువు కూడా ముఖాన ముసుగు వేసుకో. నేనే అనుకుని నీకు తేనె రొట్టెలు, మీగడతోసహా మేపుతారు!'' అన్నది దిలైలా.

తేనెరొట్టెలు తినమని నిర్బంధించాడు. నేను వాటిని నోట పెట్టేసరికి వాంతి కలిగి నంత పని అయింది. వచ్చినవారికి అను మానం తగిలి వాటిని తినకుండానే వెళ్లి పోయారు. నా భర్తకు డబ్బులు రాక పోవటమే గాక చేసిన సరుకంతా వృథా అయిపోయింది. ఆ మాట నిజమే, కాని నా తప్పు మాత్రం ఏమిటి? నన్ను తేనె రొట్టెలు తినమనటం నా భర్త తప్పు. అయినా, తన వ్యాపారాన్ని పాడుచేశానని నా భర్త నా మీద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి నాకు తేనె రొట్టెలు తినే శిక్ష విధించి ఇక్కడ నిర్బంధంలో ఉంచాడు. తెల్లవారుతూనే రాజభటులు

ఈ మాటలకు మోసపోయి కొత్తవాడు ఆమె కట్లు విప్పాడు. అతన్ని స్తంభానికి కట్టి, దిలైలా అక్కడవున్న గుర్రం ఎక్కి బగ్దాదుకు వెళ్ళిపోయింది.

తెల్లవారగానే ఫిర్యాదీలు అయిదుగురూ లేచి, స్తంభానికి కట్టి వున్నది దిలైలాయే ననుకుని మళ్ళా తిట్లు సాగించారు. కాని స్తంభానికి కట్టి వున్న వాడు, ''ఎంతకూ తేనె రొట్టెలు రావేం?'' అని అడిగాడు. వారతని ముఖాన ఉన్న ముసుగు తొల గించి చూసి, ముసలిది మళ్లీ తమ కళ్లలో కారం కొట్టిందని తెలుసుకున్నారు.

కొద్దిసేపట్లో ఖాలిద్ స్వయంగా వచ్చాడు. జరిగినదంతా విన్నాడు. ఇది

తనవల్ల అయేపని కాదనుకున్నాడు. అంద రినీ వెంటపెట్టుకుని ఆయన నేరుగా ఖలీఫా వద్దకే బయలుదేరాడు.

ఖలీఫా హారూన్ అల్ రషీద్ అందరి కథలూ విని, ఎవరెవరికేమేమి నష్టం జరిగిందో అదంతా తాను సరిచేస్తానని మాట ఇచ్చాడు. కాని ముందుగా ముసలి దాన్ని పట్టవలసి ఉంది.

ఆ ముసలిదాన్ని పట్టవలసిన భారాన్ని ఆయన ఖాలిద్ పైనా, ముస్తఫా పైనా వేశాడు.

ఖాలిద్ ఆ పని తనవల్ల ఎంత మాత్రం కాదన్నాడు. అయితే అందుకు మరెవరి నన్నా చూపమన్నాడు ఖలీఫా.

''కొత్త కొత్వాలు అహ్మద్ వుండగా మరొకరెందుకు? ఆయన పదవిలోకి వచ్చి నాక ఇంతవరకెవరినీ పట్టిన జాడ లేదు. ఆ ముసలిదాన్ని పడితే ఆయనే పట్టాలి. ఈ పని కూడా చెయ్యలేకపోతే ఇక ఆయన ప్రజ్ఞ ఏముంది?'' అన్నాడు ఖాలిద్.

ఖలీఫా అహ్మద్‌ను పిలిచి, అతనితో ముసలిదానికథ యావత్తూ చెప్పి, ఆమెను పట్టుకోమని ఆదేశించాడు. అహ్మద్ ఆ క్షణమే తన నలభైమంది భటులతో బయలుదేరాడు. ఈ భటులపైన పెత్తం దారు గూని అలీ అనేవాడు. వాడు తన



యజమాని అయిన అహ్మద్‌తో, ''అయ్యా, నా ఉద్దేశం, మనం ఈ ముసలిదాన్ని పట్టటంలో హసన్‌గారి సహాయం కూడా తీసుకుంటే బాగుంటుందని!'' అన్నాడు.

''ఓరి గూనివాడా! మన కింకొకరు సహాయం చెయ్యటమేమిట్రా? మన మేనా అంత చాతకాని వాళ్ళం? మరో సారి ఆ మాట అన్నావంటే ముక్కలు విరగగలవు, జాగ్రత్త!'' అని అహ్మద్ హసన్‌కు వినిపించేలాగా అన్నాడు.

ముసలిదాన్ని పట్టేపనికి తనను కాదని ఖలీఫా అహ్మద్‌ను నియోగించి నందుకే కుళ్ళిపోతున్న హసన్, అహ్మద్ ప్రగల్భాలు విని ఇంకా బాధపడ్డాడు. అతడు తనలో

''కానీ! నా సహాయం లేకుండా ఈ అహ్మద్‌కు ముసలిది దొరికినప్పటి మాట కదా!'' అనుకున్నాడు.

నలభైమంది భటులనూ రాజసౌధం వెలపల మైదానం మీదికి తెచ్చి, ''ధీరాగ్రేసరులారా! మిమ్మల్ని నాలుగు దళాలుగా విభజిస్తాను. నాలుగు దళాలూ నగరం నాలుగు పేటలూ చక్కగా ఘాలించండి. రేపు మధ్యాన్నానికల్లా అందరూ ముస్తఫా వీధిలో ఉన్న సరాయి వదకు చేరుకోండి. నేను వచ్చి మీ అనుభవాలు తెలుసుకుంటాను,'' అన్నాడు అహ్మద్.

నాలుగు దళాలూ నాలుగు వైపులా వెళ్ళిపోయాక అహ్మద్ కూడా స్వయంగా ఆచోకీ లాగటానికి బయలుదేరాడు.

తనను పట్టటానికి ఖలీఫా అహ్మద్‌ను నియోగించడం విని దిలైలా కొంచెమైనా భయపడలేదు. ఆమె తన కుమార్తెతో, ''అమ్మాయీ, నన్ను పట్టగలవాడు హసన్ ఒక్కడే. ఖలీఫా అతన్ని ఈ పనికి నియోగించక పోవటం మన అదృష్టం. ఇక అహ్మద్ మాటా? అతన్ని నువ్వయినా ఏడిపించవచ్చు,'' అన్నది.

''ఐతే వాళ్ళను, నేను పోయి మోసం చేసిరానా, అమ్మా?'' అన్నది జీనాబ్.

''అట్లాగే వెళ్ళిరా, తల్లీ!'' అన్నది దిలైలా.

జీనాబ్ చాలా అందంగా అలంకరించుకుని, అతి పల్చని సిల్కు మేలిముసుగు వేసుకుని, ముస్తఫా వీధిలో హజ్ కరీమ్ అనేవాడు నడుపుతున్న సరాయికి వెళ్ళింది. హజ్ కరీమ్ వద్దకు పోయి రెండు సలాములు చేసి, ''కొంతమంది ఆప్తమిత్రులు వస్తున్నారు. వారు మామూలు మనుషులతో సంబంధం లేకుండా కాలక్షేపం చేస్తారు. అందుచేత మీ సరాయిలో పెద్దగది ఒకరోజు అద్దెకిప్పించండి. అయిదుదీనారాలిస్తాను,'' అన్నది. హజ్ కరీమ్, జీనాబ్ అందచందాలు చూసి, అసలు అద్దెకూడా అవసరం లేదన్నాడు. వచ్చిన అతిథులంతా తన సారా ఖర్చుచేస్తే అదే చాలునన్నాడు.

—(ఇంకావుంది)





# విఘ్నేశ్వరుడు

పార్వతి పుత్రగణపతి కేకకు బిరబిరా వచ్చి, తల తెగిపడి ఉన్న బాలుణ్ణి చూసి, శివుణ్ణి చురచుర చూస్తూ, ''ఎంత పని చేశావు! మన పుత్రుణ్ణి నరికావు! పుత్ర హంతకుడివి!'' అంటూ కుప్పలా కూలబడి భోరుమని శోకించసాగింది.

అంతవరకు స్తంభించిపోయి చూస్తున్న గుంపులో ఒక్కసారిగా కలకలం సముద్ర ఘోషలాగా చేలరేగింది. పెద్దనేరం చేసిన వాణ్ణిలాగ శివుణ్ణి చూడసాగారు. శివుడికి ముచ్చెమటలు పోశాయి. బిక్కముఖం పెట్టి, ''నాకు తెలియని పుత్రుడా! ఎలాగ వచ్చాడు?'' అన్నాడు.

పార్వతి తనవంటికి పెట్టుకున్న నలుగు ముద్ద ఏ విధంగా పుత్రగణపతి అయినదీ చెప్పింది. దానికి శివుడు పెదవి విరిచి, కోపంగాచూస్తూ, ''నీకు కుమారుడైతే కావచ్చు, అందుకే అమ్మ, అమ్మ అంటూ తెగ వాగాడు. మన పుత్రుడంటున్నావు, నాకు పుత్రుడెలాగ అవుతాడు?'' అవి అడిగాడు.

పార్వతితెల్లబోయింది. అప్పుడు విష్ణువు బ్రహ్మకు సైగచేశాడు. బ్రహ్మ ముందుకు వచ్చి, ''శివుడు పార్వతిచేతిని పుచ్చుకున్నప్పుడే శివుడి తేజస్సు పార్వతి శరీరంనిండా ప్రవేశించి పులకరింప జేసింది. అది మొదలు శివుడు, పార్వతిలో సగభాగంగా అంతర్లీనమై ఉంటూనే ఉన్నాడు. పుత్రగణపతి శివుడి కుమారుడే!'' అని నాలుగు నోళ్ళతో నొక్కి చెప్పాడు.



శివుడు చేతులు నలుపుకొంటూ దిక్కులు చూస్తూంటే, పార్వతి బాలుడి కళేబరం మీదపడి ఏడుస్తూంటే, ఆకాశం నుండి, "ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తూన్న తలను తెచ్చి నాకు అతకండి, నేను లేస్తాను!" అన్న పుత్రగణపతి వాక్కులు వినిపించాయి.

వెంటనే దేవతలూ, ప్రమథులూ అంతా గాలిస్తూ ఎంత వెతికినా ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తున్న వాళ్ళెవ్వరూ కనిపించలేదు.

ఇంకా వెతుకుతూ పోగాపోగా సహ్యాద్రి పర్వతం మీద బిల్వవనంలో ఒక తెల్లని ఏనుగుగున్న మాత్రం ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తూనే, శివస్మరణ చేస్తూ కనిపించింది.

ఆ ఏనుగుగున్న దేవలోకంలో దేవతా గజమైన ఐరావతం కుమారుడైన గజేంద్రుడు. ఐరావతం ఇంద్రుడి వాహనం. ఒకసారి ఇంద్రుడు అలా వస్తూంటే గజేంద్రుడు అతణ్ణి లెక్కచేయకుండా తన ధ్యాసలో తానుండటం చూసి ఇంద్రుడు కళ్ళెర్రజేసి, "నా వాహనం కొడుక్కు ఇంత పొగరా!" అని దుర్భాషలాడాడు.

అప్పుడు గజేంద్రం శాంతంగా, "నా తండ్రి తనవిధిని తాను చేస్తున్నాడు, అంత మాత్రం చేత నీవు మమ్మల్నితక్కువ చేసి మాట్లాడవలసిన పని లేదు, నేను నీకు భయపడాల్సిందేమీ లేదు!" అన్నాడు.

"నేను దేవేంద్రుణ్ణిరా, ఏనుగా!" అన్నాడు ఇంద్రుడు గర్వంగా.

"ఔను, నేను ఏనుగును, గజేంద్రుణ్ణి! మరొకరు నాగేంద్రుడైతే, ఇంకొకరు పక్షీంద్రుడు. ఇలా ఎంతమంది ఇంద్రుళ్ళున్నా ఉండవచ్చు. నూరు యజ్ఞాలుచేస్తే చాలు, ఇంద్రపదవి పొందవచ్చు. తపస్సుతో సాధించవచ్చు. అందుకే ఎవరెక్కడ ఏది చేస్తున్నారని తెలిసినా నీకు తగనిభయం! ఇంద్రత్వం ఏమంత గొప్పదని నీవు జ్ఞానంతో చెప్పుకొంటున్నావు?' అన్నాడు గజేంద్రుడు.

ఇంద్రుడు రెచ్చిపోయి శపించుతున్నట్టుగా, "నీ తల తెగా!" అని తిట్టాడు.

గజేంద్రం నవ్వుతూ, "శివుడిఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదుగదా, ఆ తలముందే నీ తల వంచవలసి వస్తుందేమో ఎవరి కెరుక!" అన్నాడు.

గజేంద్రం గొప్ప జ్ఞాని అని గుర్తించలేని గర్వాంధుడైన ఇంద్రుడు, "ఆ శివుణ్ణే నమ్ముకో, భూమ్మీద పడు!" అని గజేంద్రాన్ని స్వర్గం నుండి కిందకు తోసేశాడు. గజేంద్రం సహ్యపర్వతం మీద పడి, ఎల్లప్పుడూ శివసంస్మరణం చేసుకుంటూ, శివుడి నివాసమైన కైలాసం ఉండే ఉత్తర దిక్కుకే తలపెట్టుకొని నిద్రిస్తూండేది.

దేవతలు గజేంద్రం తలను నరికి తీసుకెళ్ళారు. ఆ తలను శివుడు బాలుడి కళేబరానికి అతికించగానే పుత్రగణపతి ఏనుగు ముఖంతో కళకళలాడుతూ లేచి నించున్నాడు.

"నా ముద్దులయ్యకు ఏనుగు ముఖం ఏమిటి? నేను చూడలేను," అని పార్వతి దుఃఖంతో కళ్ళు మూసుకొంది.

అప్పుడు గజముఖుడు వీనులు విందు చేసేస్వరంతో, "అమ్మా! ఎందుకు విచారిస్తావు? జరగాల్సిందంతా నిర్విఘ్నంగా జరిగింది! ఆనాడు మీరిద్దరూ గోడమీదఏనుగుల చిత్రాన్ని చూస్తున్నప్పుడు కనిపించిన



నన్ను గుర్తించలేదా? విఘ్నేశ్వరుణ్ణి!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే పార్వతికి కల వచ్చినట్లుగా ఆ విశేషమంతా కనిపించింది. శివుడికీ అలాగే విఘ్నేశ్వరుడు స్ఫురణకు వచ్చాడు.

"విఘ్నేశ్వరా! నీవా, మాకు పుత్రుడవై అవతరించావా! ఇందుకా నన్ను అంతగా కవ్వించి కయ్యానికి కాలుదువ్వి, నాకు కోపం తెప్పించింది! నాకు యిప్పుడు అంతా బోధపడుతున్నది, నీ లీల అద్భుతం!" అన్నాడు శివుడు.

"లేకపోతే గజాసురుడికి, నువ్వు ఇచ్చిన వాగానాలు ఎలాగ నెరవేరతా



యనుకున్నావు?'' అని విఘ్నేశ్వరుడు జ్ఞాపకం చేశాడు.

శివుడు, ''బాగా జ్ఞాపకంచేశావు, నేను గజచర్మాన్ని కూడా కట్టుకోవలసి ఉన్నది. ఏనుగుతల నా కుమారుడికి ఉండనే ఉన్నది!'' అన్నాడు. ఆ తర్వాత గజచర్మాన్ని తెప్పించి కట్టుకున్నాడు.

శివుడు విఘ్నేశ్వరుడికి వినయంగా వంగి, ''విఘ్నేశ్వరా! నీ విశ్వరూపాన్ని చూపించు!'' అని కోరాడు.

అప్పుడు విఘ్నేశ్వరుడు ఆకాశానికి పెరిగి ఐదుతలలతో కనిపించాడు. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము అనే పంచ భూతాల రంగులైన ఆకుపచ్చ, మబ్బు రంగు, ఎరుపు, తెలుపు, నీలం రంగులు అయిదు ఏనుగు తలలకూ ఉన్నవి. ఆ తలలపై నక్షత్రాలు తల పూవులుగా మెరుస్తున్నవి. విఘ్నేశ్వరుడి గుండ్రని పెద్ద బొజ్జ మినుకు మినుకుమనే కాంతులతో ఆకాశాన్ని పోలి ఉన్నది. అతని అనేకమైన చేతుల్లో అంకుశము, గొడ్డలి, పాశము, కలశములతో బాటు త్రిమూర్తులకు చెందిన శంఖ చక్ర గదా పద్మ ఢమరుక త్రిశూల వజ్రాయుధాలు, జపమాల, కమండలువు, వీణ, ఖడ్గము, శక్తిఈటె మొదలైనవన్నీ ఉన్నాయి. అతని రూపాన్ని తలలు పైకి సారించి చూస్తున్న వారంతా కళ్ళు మిరుమిట్లు గొలిపే అతని తేజస్సు చూడలేక తలలు దించారు. అప్పుడు అందరిలోనూ ఏదో మహానందం కలిగింది. సరస్వతి వీణ తీసి విఘ్నేశ్వరుడికి ప్రియమైన హంస ధ్వని రాగాన్ని సంరంభంగా దురితగతితో పలికిస్తూంటే, నారదుడు మాయామాళవ గౌళరాగాన్ని మధ్య మధ్య జోడించాడు. శివుడు ఆనందతాండవం చేశాడు.

ఇంద్రుడితో సహా ముక్కోటి దేవతలు తలలు వంచి విఘ్నేశ్వరుడికి నమస్కరించారు. అప్పుడు ఇంద్రుడి చెవుల్లో, 'ఆ తల ముందే నీ తల వంచవలసి వస్తుందేమో!' అని గజేంద్రం అన్న



మాటలు గింగురుమన్నాయి. పుత్ర గణపతికి అతికిన తల గజేంద్రానిదని అతనికి తెలుసు. ఇంద్రుడు చెవులు పట్టుకొని మూడుసార్లు వంగి లేస్తూ లెంపలేసుకొని సాష్టాంగపడి మ్రొక్కి, "గజేంద్రా! నీవు జ్ఞానివి, నేను అజ్ఞానిని. నా గర్వాన్ని మన్నించు!" అని మనస్సులో అనుకున్నాడు. దేవతలంతా ఇంద్రుడు చేసినట్లే అనుకరించి మ్రొక్కారు.

విశ్వరూపం దాల్చిన విఘ్నేశ్వరుడితో శివుడు, "విఘ్నేశ్వరా! నీ రూపానికి ఎన్నో విశేషార్థాలున్నట్లుగా మాకు తోస్తున్నది, తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాము." అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "శివభక్తుల సమ్మేళనమే యీ విశ్వం. నేను విశ్వజననీజనకులైన పార్వతీ శివులకు పుత్రుణ్ణి మాత్రమే. వారికి అంజలి ఘటిస్తున్నాను!" అని అంటూ చేతులెత్తి జోడించి ఊరుకున్నాడు.

బ్రహ్మ ముందుకు వచ్చి యిలా చెప్పాడు: "మత్స్యావతారం ఎత్తి విష్ణువు సోమకాసురుణ్ణి సంహరించి వేదాల్ని భద్రపరిచాడు. నిండుచందమామ కాంతుల్ని విరజిమ్ముతూ విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి వాటిని నాకు అందజేశాడు. నాకు జ్ఞానసిద్ధి కలిగింది. అప్పుడు విఘ్నేశ్వరుని గురించి విశేషాలు చాలా తెలుసుకున్నాను. సంకల్పసిద్ధికి మూలమైన విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి సక్రమంగా సృష్టిచేయగల్గాను.

విఘ్నేశ్వరుడు విరాట్‌స్వరూపుడు. వ్యాపించేవాడు గనుకనే 'విష్ణుం' అని అనిపించుకున్నాడు. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, మట్టి అనే పంచమహాభూతగణానికి అధిపతి గనుకనే విఘ్నేశ్వరుడు మహాగణాధిపతి! లక్ష్మీసరస్వతుల నిలయంగా నడుమనున్న విశ్వరూప విఘ్నేశ్వరుడి ఐదు తలలూ శ్వేతనీలము, ఊదా, ఎరుపు, శ్యామనీలము, పచ్చరంగులతో పంచమహా భూతాలకు ప్రతిరూపాలుగా ఉన్నవి.

ఏనుగుతల బలానికీ మేధస్సుకీ చిహ్నం; బొజ్జ ఉండగానే సంబరం కాదు, తగినంత మేధస్సు ఉండాలని అర్థం. కొత్తవి పడుతూ ఉంటే, పాతవి జీర్ణం అవుతూండే తినుబండారాలకు మల్లే, అనంతాకాశంలో నక్షత్రమండలాలు, గ్రహాలు, ఉపగ్రహాలు, గోళాలు, లోకాలు నిండి ఉన్నాయని లంబోదరం గుర్తుచేస్తూన్నది. ఈయన త్వరలోనే చిన్న ఎలుక నెక్కి తిరగబోతున్నాడు. అంటే సూర్యచంద్రాది గ్రహాలు మహామండలాలు శూన్యాకాశంలో గతులు తప్పకుండా అంత లాఘవంగా తిరుగుతున్నాయనీ, విశ్వస్వరూపం చిట్టెలుకపై ఏనుగుస్వారి లాంటి చిత్రాతిచిత్రమైన విజ్ఞానంతో నిండి ఉన్నదనీ చెప్పడం అన్నమాట! విశ్వవిజ్ఞానానికి విఘ్నేశ్వరుడు సంకేతం, విజ్ఞానేశ్వరుడు అనబడుతున్నాడు.

విశ్వానికి అధినేత, నియంత అంకుశాన్ని ధరించాడు. బుద్ధిబలానికి విఘ్నేశ్వరుడు గురుతు! బుద్ధి వెర్రితలలు వేయకుండా మావటివాడు ఏనుగును ఉంచినట్లుగా, అదుపులో ఉంచాలని అంకుశం మనో నిగ్రహానికి ప్రతిరూపంగా ఉన్నది. సర్వమూ తమతమ ధర్మాలకు కట్టుబడి ఉన్నదని విఘ్నేశ్వరుని చేతనున్న పాశము చెబుతున్నది. పరిపూర్ణత



తొణకని బెణకని నిండుకుండ లాంటిదని, కలశాన్ని ధరించాడు. పరశువుతో విఘ్నాన్ని ఛిన్నాభిన్నం చేస్తాడు. విశ్వం నాదాత్మకమైనది. అనేక ఓంకార ఝంకారాల్ని ధ్వనించే విశ్వవీణనే విఘ్నేశ్వరుడు మీటుతున్నాడు. చరాచర జీవకోట్ల మొరలన్నీ వినడానికే అంత పెద్ద చెవులు రిక్కించి ఉన్నాడు. ఏనుగు కళ్ళు చిన్నవైనా సూక్ష్మదర్శనం కలిగి, నిశితంగా చూడగల్గినట్లే, పరమాణువు మొదలుకొని బ్రహ్మాండాల్ని పరిశీలిస్తున్నాడు. వంపు పెట్టిన వక్రతుండం వంకల్ని తుండతుండాలుగా చేసి సరిదిద్దుతుంది. తొండం నిడువుగా సాగి

ఎన్నిటినైనా అందుకొంటుంది, అంది స్తుంది!

సస్యసమృద్ధికి విఘ్నేశ్వరుడు అధి నాధుడు. భోజనప్రియుడు గనుక, ఆహారం వల్లనే కండబలమూ, కండబలం ఉంటేనే బుద్ధిబలానికి నిలకడ, సార్ధకత ఉంటాయని పండ్లూ, పిండివంటలూ, ఆకుకూరలూ వద్దనకుండా స్వీకరిస్తాడు. భాద్రపదమాసంలో ఏనుగుల్లాంటి మేఘాలు తొండాలవంటి వర్షపుధారలు కురుస్తాయి. మేఘ గణాలకు నాథుడు గణనాధుడు! విఘ్నేశ్వరుడు అవత రించిన ఇది భాద్రపదమాసమే. భాద్రపద శుక్లచవితినాడు విఘ్నేశ్వరుణ్ణి అర్చించిన వారికి సంకల్పసిద్ధితోపాటు, అన్ని విఘ్నా లను అరికట్టుకోగల బుద్ధి నిబ్బరము కలుగుతుంది.

తన దంతపు గంటాన్ని మోపినది ఎత్తకుండా విఘ్నేశ్వరుని చేతి మీదుగానే పంచమవేదం అనదగ్గ మహాభారతం అక్షరసిద్ధిపొంది, చిరస్థాయిగా నిలుస్తుంది. విఘ్నరాజు మహిమలు వర్ణించడం నా తరం కాదు. ఏ కార్యమైనా తలపెట్టే ముందు విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి, పూజించి మరీ ప్రారంభించాలి. శుభం కలుగుతుంది అంటూ అభయముద్ర పట్టి ఉన్నాడు. మహాగణాధిపతి అందరికీ ప్రథమ ఆరాధ్యదైవము!'' అని బ్రహ్మ ముగించాడు.

అప్పుడు శివుడు అందర్నీ కలయజూసి, ''బ్రహ్మవాక్కు విన్నారుకదా, విఘ్నేశ్వరుడు తొలిపూజ దేవర!'' అన్నాడు.

అందరూ ఔను, ఔను అని తలలూ పారు. నారదుడు హంసధ్వనిరాగాన్ని వీణపై హొరెత్తిస్తూంటే, సరస్వతి హంసానంది రాగాన్ని అందుకొంది. ఆ సంరంభంలో పార్వతి విఘ్నేశ్వరుడికి నమస్కరించబోతూంటే, విశ్వరూప మహా గణాధిపతి, ''అమ్మా, అమ్మా వద్దు!'' అని వారిస్తూ చప్పున విశ్వరూపాన్ని ఉప సంహరించుకొని, గుజ్జువినాయకుడై తల్లి కాళ్ళు చుట్టేసుకున్నాడు.





# ఆశపోతు దివ్యదృష్టి

చంద్రపురంలో పాపయ్య అనే చిన్న వ్యాపారస్థుడొకడుండేవాడు. అతడు పరమ పిసినారి, ఆశపోతు. ఇంట్లో ఉన్నా, దుకాణంలో వున్నా ఎప్పుడూ క్షణాల మీద కోటీశ్వరుడై పోవటానికి సులభమార్గాలు ఏవైనా వున్నవా అని ఆలోచిస్తూండేవాడు.

ఒకనాడు పాపయ్య దుకాణానికి వచ్చిన ఒక ఆసామీ, మాటల సందర్భంలో దాపులగల అరణ్యంలో గొప్ప మహత్తులు గల యోగి ఒకడున్నాడని అతడికి చెప్పాడు.

ఆ మర్నాడే పాపయ్య అరణ్యానికి పోయి, యోగిదర్శనం చేసుకుని, ఆయనకు నమస్కరించి, "స్వామీ, నాకు త్వరలో కోటీశ్వరుడై పోవాలని వున్నది. అందుకేదైనా సులభమైన మంత్రం ఉపదేశించండి," అని అడిగాడు.

యోగి నవ్వి, "నాయనా, మనిషి ఏది సాధించాలన్నా కష్టించి పనిచేయాలి. అదే,అన్నింటికన్నసులభమైన మంత్రం," అన్నాడు.

పాపయ్య, యోగిని వదలక కాళ్ళా వేళ్ళా పడసాగాడు. యోగికి విసుగెత్తి, "నీ కోరిక చాలా అసమంజసంగా వున్నది. మరేదైనా కోరు, అలాగే తీరుస్తాను," అన్నాడు.

పాపయ్య కొంచెం సేపు ఆలోచించి, తనకు దివ్యదృష్టి ప్రసాదించవలసిందిగా యోగిని కోరాడు.

"ఇది కూడా కోరరాని కోరికే. ఎంతో తపస్సంపన్నులకు గాని దివ్యదృష్టి లభించదు. అయినా, నీ కోర్కె మరొక విధంగా సఫలం చేస్తాను," అని యోగి, పాపయ్యకు ఒక భరిణ యిస్తూ, "ఇందులో అంజనం వున్నది. ఇది

గుంటక సాంబిరెడ్డి



కళ్ళకు రాసుకుంటే దివ్యదృష్టి వస్తుంది. కాని, ఒకసారి రాసుకుంటే, దివ్యదృష్టి ఆ ఒక్కసారికి మాత్రమే పని చేస్తుంది,'' అని చెప్పాడు.

పాపయ్య పట్టరాని సంతోషంతో, ఇంటి దారి పట్టాడు. కోటీశ్వరుడయేందుకు దివ్యదృష్టిని ఎలా ఉపయోగించాలా అని ఆలోచిస్తూ, అతడు నడుస్తూండగా హఠాత్తుగా చేతకత్తితో, యముడి లాంటి వాడొకడు ఎదురయ్యాడు.

''నేనెవరో తెలుసా? గజదొంగ గంగన్నను. గొడవ చేయకుండా, నీ దగ్గిరున్న డబ్బంతా యిచ్చి, ప్రాణాలు దక్కించుకో,'' అన్నాడు గంగన్న.

గంగన్న ఆ ప్రాంతాల పేరుమోసిన గజదొంగ. చంద్రపురం రాజు ఎంతో కాలంగా వాణ్ణి పట్టుకోవాలని ప్రయత్నించి విఫలుడయాడు. పాపయ్య తన దగ్గిర డబ్బేమీ లేదని గంగన్నకు చెప్పినా ఆ మాట నమ్మక, పాపయ్య దుస్తులు తడివిచూసి, అతడి రొండిన వున్న అంజనం భరిణ బయిటికి లాగాడు.

గంగన్న గద్దించి ప్రాణం తీస్తానని భయపెట్టిన మీదట, పాపయ్య అంజనం రహస్యం చెప్పేశాడు.

''ఆహాఁ, రాజుగారి కోశాగారం దోచటం ఎలాగా అని, చాలా కాలంగా ఆలోచిస్తున్నాను. ఈ అంజనం సాయంతో దానికున్న రహస్యమార్గాలు తెలుసుకోవచ్చు. సరే, యికపో. నా సంగతి రాజుగారితో చెప్పావా, నేను పట్టుబడినా, నా కొడుకైనా వచ్చి, నీ ఇల్లు దోచి, నిన్ను చంపేస్తాడు,'' అని గంగన్న, పాపయ్యను భయపెట్టి, భరిణలో వున్న అంజనం సగం తీసుకుని, మాయమయాడు.

పాపయ్య బతుకు జీవుడా అనుకుంటూ ఇల్లు చేరాడు. అంజనం ఉపయోగించి ఏ విధంగా కోటీశ్వరుడు కావాలన్న ఆలోచన యింకా తెగలేదు. అతడు భరిణను గూట్లో పెట్టి, కొట్టు తెరిచేందుకు వెళ్ళాడు.

పాపయ్య పక్కింటి రామయ్య అనే బ్రతికిచెడ్డ గృహస్థుడి కూతురు లక్ష్మికి ఆ రోజే పెళ్ళి చూపులు. ఆ పిల్ల అలంకరణ అంతా పూర్తి అయి, తీరా కాటుక కోసం చూస్తే, కాటుకభరిణ కనిపించ లేదు. లక్ష్మి, కాటుక పెట్టించుకుని వస్తానంటూ, పాపయ్య ఇంటికి వచ్చింది.

పాపయ్య భార్య కాటుక భరిణ కోసం చూస్తే, గూట్లో పాపయ్య పెట్టిపోయిన అంజనం భరిణ కనిపించింది. అది మామూలు కాటుక అనుకుని, పాపయ్య భార్య, లక్ష్మి కళ్ళకు ఆ అంజనం రాసి పంపేసింది.



పెళ్లి అలంకరణలో వున్న కూతురును చూసి రామయ్య దిగులుగా, "అమ్మా, నిన్ను గొప్ప ధనవంతుడికిచ్చి, వైభవంగా పెళ్ళి చేయాలనుకుంటూ వుండేవాడిని. మనది చితికిపోయిన సంసారం. పట్టుమని పదిమందికైనా విందుభోజనం పెట్టగలనో, లేదో!" అన్నాడు.

తండ్రి విచారం పోగొట్టాలనుకుని లక్ష్మి, "తాతయ్య, వాళ్ళ తాతగారు మన ఇంటి ఆవరణలోనే ఎక్కడో లంకెల బిందెలు పాతిపెట్టిపోయాడని చెబుతూ ఉండేవాడు గదా? అవి మనకు దొరికి, హఠాత్తుగా సంపన్నులం అయిపోగూడదా, నాన్నా!" అన్నది.

ఆ మరుక్షణం లక్ష్మి కళ్ళముందు మెరుపు మెరిసినట్లయి, ఇంటి ఈశాన్య దిక్కున ఒక చోట, భూమిలో రెండు నిలువుల లోతున, బంగారు నాణాలున్న లంకెలబిందెలు కనిపించాయి. ఆమె, ఆ సంగతి తండ్రికి చెప్పింది. రామయ్య తవ్వి చూడగా, లంకెలబిందెలు దొరికాయి.

లక్ష్మి కొంచెం సేపు ఆలోచించి, తన వింత అనుభవానికి, తాను పెట్టుకున్న కాటుకే కారణం అయివుంటుందనుకుని, ఆ విషయం చెప్పటానికి పాపయ్య ఇంటికి వెళ్ళింది.

ఆ సమయాన వీధిలోంచి ఒక చాటింపు వినిపించింది. రాత్రి రాజుగారి ధనా

గారాన్ని ఎవరో దోచుకున్నారు. వాళ్ళ ఆచూకీ తెలిపిన వాళ్ళకు, పది వేల వరహాల బహుమానం!

లక్ష్మి, పాపయ్య భార్యకు సంగతి చెప్పి, "అది మహిమగల కాటుకలా వున్నది, పిన్నీ. రాజుగారి చాటింపు విన్నావు గదా? ఆ కాటుక సాయంతో దొంగల ఆచూకీ రాజుగారికి చెప్పి, పదివేలవరహాలు సంపాయించవచ్చు," అన్నది.

లక్ష్మి, పాపయ్య భార్యతో మాట్లాడుతున్నప్పుడు, పొరుగింటావిడ మీనాక్షమ్మ కొంచెం దూరంలో నిలబడి వున్నది. ఆమె సంగతంతా విని, ఏమీ ఎరగనట్టు తన ఇంటికి పోయి, ఒక కన్ను పాపయ్య ఇంటి మీద వేసి వుంచింది.

రాత్రి కాస్త పొద్దుపోయాక పాపయ్య ఇంటికి తిరిగి వచ్చి, అంజనం లక్ష్మికి ఉపయోగించిన తీరు విని, భార్య మీద ఖస్సుమంటూ లేచి, "దొంగల్ని పట్టుకుంటే ముష్టి పదివేల వరహాలే బహుమానం! కనీసం లక్షవరహాలు దొరికేలా వుంటే తప్ప, లేకపోతే అంజనం వాడను," అంటూ కేకలు పెట్టాడు.

ఈ గొడవంతా విన్న మీనాక్షమ్మకు, విషయమంతా పూర్తిగా అర్థమైపోయింది. ఆమె తెల్లవారుతూనే భర్తను రాజుగారి దగ్గరకు పంపింది. రాజు, పాపయ్య దగ్గరవున్న అంజనం సంగతి విని, అతణ్ణి పిలిపించి, కొరత వేయిస్తానని భయపెట్టిన మీదట, అతడు జరిగినదంతా చెప్పేశాడు.

రాజు, పాపయ్య దగ్గరవున్న అంజనం తీసుకుని, "నా ధనాగారంలో దొంగతనం జరగబోతున్నదని తెలిసీ, ఆ సంగతి చెప్పనందుకు, నిజంగా నిన్ను కొరత వేయించాలి. కాని, క్షమించి వదిలేస్తున్నాను," అన్నాడు.

తరవాత రాజు, అంజనం సాయంతో దొంగ గంగన్నను పట్టుకుని, వాడి నుంచి పోయిన సొమ్మంతా రాబట్టాడు. ఇందుకు తోడ్పడిన మీనాక్షమ్మ భర్తకు పదివేల వరహాలు బహుమానం యిచ్చాడు.



# ముహూర్తబలం

రామశాస్త్రి పంచాంగం చూసి, లెక్కలు గుణించి, పది రోజుల తరవాత, తన కూతురి పెళ్ళి సంబంధం కోసం, రామాపురం వెళ్ళడానికి ముహూర్తం నిర్ణయించాడు. భార్య అతణ్ణి తొందర పెడుతూ, "నిక్షేపం లాంటి సంబంధం, ఆలస్యం అయితే మరెవరైనా తన్నుకు పోగలరు. కొంచెం ముందుగా వెళ్ళగూడదా?" అన్నది.

రామశాస్త్రి భార్యను గట్టిగా కసిరి, "మంచి ముహూర్తాన ప్రారంభించిన పనులు నిర్విఘ్నంగా సాగుతాయి. ముహూర్తబలం నీకేం తెలుసు!" అన్నాడు.

ప్రయాణ ముహూర్తం నిర్ణయించుకున్న రోజున రామశాస్త్రి బయలుదేరి వెళ్ళి, సాయంకాలానికల్లా యింటికి వస్తూనే భార్యతో, "ముహూర్తబలం బాగుండబట్టే క్షేమంగా ఇల్లుచేరాను," అన్నాడు.

"ఏం జరిగిందండీ?" అన్నది భార్య అర్థంకాక.

"నేనెక్కిన రెండెడ్లబండి దారిలో బోల్తాపడింది. నాకు తప్ప, బండిలో వున్న వాళ్ళందరికీ దెబ్బలు తగిలినై," అన్నాడు రామశాస్త్రి.

"అయితే మీరు రామాపురం వెళ్ళనేలేదా?" అని అడిగింది భార్య.

"వెళ్ళకేం, వెళ్ళాను! వాళ్ళు నిన్ననే మరొక సంబంధం ఖాయం చేసుకున్నారట," అన్నాడు రామశాస్త్రి.

—భైరి సత్యనారాయణ



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.





B. Murali — Gopal Shroti

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : హయ మెక్కన దెందుకు ?

రెండవ ఫోటో : రయమున పోయేటందుకు !

పంపినవారు : టి. రాజేశ్వరీబాయి c/o టి. ఎస్. శంకర్‌రావ్, పామిడి. (అనంతపురం జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

డాక్టరుగారూ! మా బొమ్మ పాపాయికి వంట్లో బాగాలేదు. కొంచెం చెక్ చేసి చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు. కడుపులోనే ట్రబుల్. ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం కదా డాక్టర్. ఉడ్ వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా చలికాలమైనా, ఏ కాలమైనా సరే, పిల్లలకు కడుపులో ఏలాంటి ట్రబుల్ వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్ ఇవ్వండి.






100 ఏళ్ళుగా మాతృలోకం విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS OPPL 3 /80 TE

# WIN 777 fantastic prizes in the exciting Holiday Nepal Children's Contest





## ★ Fabulous Bumper Prize with Special Rotating Trophy.

The lucky child who wins this magnificent trophy will be honoured at a special glittering function attended by several V.I.P's in New Delhi. The child will win the coveted title of STAR OF HOLIDAY NEPAL. Besides, there will be Free Air Fare for child and both parents, Ex-Delhi. Also, free Accomodation at the most luxurious Hotel Suite in Kathmandu for 4 days and 3 nights...with free meals, free transfers, free sightseeings. And Rs. 300 worth Free Play Coupons Courtesy Casino Nepal for each parent.

## 5 Grand First Prizes

Free Air Fare for the child ex-Delhi, ex-Calcutta, ex-Patna. Free accomodation for the child and both parents on the 5-star package.

## 5 Exciting Second Prizes

Free Air Fare for the child ex-Delhi, ex-Calcutta, ex-Patna. Free accomodation for the child and both parents on the 3-star package.

## 10 Third Prizes

Free Air Fare for child ex-Delhi, ex-Calcutta, ex-Patna. Free Accomodation for child and both parents on the 2-star package.

## 251 Consolation Prizes

1 years' Free Subscription of Target or Indrajal comics or Chandamama or Paraag of Nandan(choice of winner)

## 505 Bonus Prizes

Attractive, colourful T-shirts.

## The Contest is so easy. And, such fun too.

All you have to do is paint a picture about Kathmandu on any piece of paper. Or write a description of not more than 30 words on Kathmandu (In English or Hindi). Send it along with the coupon from this magazine.

The contest is open to all children residing in India between 8 and 15 years.

## Hurry : Closing Date 10th April '81

Recognised by






Send entry forms only to

**HOLIDAY NEPAL**
302, HOTEL AMBASSADOR,
NEW DELHI-110003.
Telephone : 690391/302.
Telex 3277 Cable "CONRESORT"

Entry forms also available at :—

HOTEL MAURYA PATNA
SOUTH GANDHI MAIDAN,
PATNA-800001 Telephone : 22067

or

144, HOTEL NEW KENNILWORTH,
LITTLE RUSSLE STREET,
CALCUTTA-700071
Telephone : 431730/442647

or **Travel Agent**

Cut along the dotted line

Name : ------------------ Age : -----

Address :-----------------------------

-----------------------------

-----------------------------

Name of this Magazine

